"కవిబ్రహ్మ" ఏటుకూరి వేంకట నరసయ్య కవితాప్రభావ, గుంటూరు

| | | |
|---|---|---|
| 1. | డా॥ కాసరనేని సదాశివరావు, M.S. | అధ్యక్షుడు |
| 2. | శ్రీ విద్వాన్ గోగినేని కనకయ్య | ఉపాధ్యక్షుడు |
| 3. | శ్రీ బొల్లేపల్లి సత్యనారాయణ | కార్యదర్శి |
| 4. | శ్రీ మాకినేని ప్రసాదబాబు, M.Sc. | సంయుక్త కార్యదర్శి |
| 5. | శ్రీ సి.హెచ్.మస్తానయ్య, C.A. | కోశాధికారి |
| 6. | డా॥ కొండబోలు బసవపున్నయ్య, M.B.B.S. | సభ్యుడు |
| 7. | శ్రీ పి. లక్ష్మణరావు, C.A. | " |
| 8. | శ్రీ లావు రత్తయ్య, M.Sc., M.Ed. | " |
| 9. | శ్రీ వడ్లమాని ఉమామహేశ్వరరావు, C.A. | " |
| 10. | శ్రీ కళ్ళం హరనాథరెడ్డి, M.A. | " |
| 11. | శ్రీ వాదెళ్ళ అప్పారావు | " |

# రైతు

(హరికథ)

ఉభయ భాషాప్రవీణ
కవిబ్రహ్మ
ఏటుకూరి వేంకట నరసయ్య

వెల : రూ.25/-

ప్రచురణ :
కవిబ్రహ్మ ఏటుకూరి వేంకట నరసయ్య కవితాప్రభాస,
గుంటూరు

ప్రథమ ముద్రణ

గుంటూరిసీమ రైతు సంఘ ప్రచురణము
గోవాడ
1942

1941 సంవత్సరములో గుంటూరిసీమ రైతుసంఘము వారిచేఁబ్రకటింపబడిన
పోటీ హరికథలలో ఈ కథ ఉత్తమముగా నిర్ణయింపబడి
రూ.116/-లు బహుమతి వడసినది.



ముద్రణ :-
విజయవాడ ఆఫ్‌సెట్ ప్రింటర్స్
చెన్నుపాటి సర్వీసు స్టేషన్ రోడ్
లబ్బీపేట, విజయవాడ-10
ఫోన్ : 476324




రైతు దేశానికి వెన్నెముక - చెమట దీసి సొంతపొలాన్ని సారవంతం జేసి ప్రపంచానికంతా భిక్ష పెట్టేది రైతు. రైతుకు ప్రాణం పశుసంపద. పశువృద్ధే రైతు వృద్ధి. అందుకే మా గుంటూరు సీమ రైతు సంఘం ఆఱు సంవత్సరాలుగా గోవాడలో మహాశివరాత్రికి పశు వ్యావసాయిక వస్తుప్రదర్శనాలు జరిపి రైతుసేవ చేస్తున్నది.

రాజ్యాంగంలో రైతు రాణ కెక్కలేదు సరిగదా మత ధర్మాల్లో సంఘ వ్యవస్థలో రైతుకు మన్నన మృగ్యం.

నోరు లేని దేవుళ్ళ పేరిట లోకాన్ని దోచుకునే ద్రోహులు హరికథలకు హార తెత్తుతారు. కాని - అన్నదాత విశ్వదాత ప్రత్యక్ష దైవం రైతుకు భక్తులు పూలదోసిలి పట్టరారేం!

జానపద గేయాలకు సారస్వతంలో జాగా చిక్కాలి.

కవులు కర్షకుల కేసి కలాలు మలపాలి. ఐహికంలో - ఆముష్మికం ఐక్యం కావాలి - ధ్యానంతో త్యాగ మహిమ తాండవించాలి. మాధవసేవ మన సేవగా మారాలి. రైతును రమారమణుగా భజించి లోకం తరించాలి.

ఈ పవిత్రభావాల ప్రచారానికే మా గుంటూరు సీమ రైతు సంఘం "రైతు హరికథ" వ్రాయించాలని సంకల్పించింది.

సత్కథకు బహూకృతి నూటపదార్లుగా పత్రికల్లో ప్రకటింపబడింది. పోటీకి

వచ్చిన కథలను శ్రీ బెజవాడ రామచంద్రా రెడ్డి (బి.ఎ., సి.బి.ఇ.) గారు, శ్రీ జాగర్లమూడి కుప్పుసామి చౌదరి గారు, ఆంధ్రవిశారద శ్రీ తాపీ ధర్మారావు నాయుడు గారు పరిశీలించి నిగ్గు తేల్చారు. వారికి మా సంఘం తరపున అభివందనాలు.

శ్రీ ఏటుకూరి వేంకట నరసయ్య (ఉ.భా.ప్ర.) గారి కథకు ఉత్తమ స్థానం లభించింది. దీనిని మా సంఘం ప్రచురించింది.

రైతు యొక్క పవిత్రజీవనాన్ని కర్షకకవితలో వారు దిద్దితీర్చారు. చక్కటి భావాలు సరసమైన పద గుంఫనలో చిత్రించటంలో వారు సిద్ధహస్తులు. రైతు పోకడల నాకలించుకొన్న రసలుబ్ధులు. పాటలో మాటలో భక్తి పరిపక్వమయింది.

రైతు కథను 'బుఱ్ఱకథ' గా కూడా ప్రచురించాలని మా సంఘం సంకల్పించింది. కవులు, గాయకులు మా ఉద్యమానికి సాయపడాలని కోరుతున్నాం.

*గోవాడ*
*12-2-42*

ఆలపాటి సూర్యనారాయణ చౌదరి
కార్యదర్శి
గుంటూరు సీమ రైతు సంఘం




గుంటూరి సీమ రైతు సంఘము వారు ప్రకటించిన హరికథా నిబంధనలు కాగడాలోఁ జూచి వ్రాయఁ గడఁగియు మిన్నకుంటిని. ఇంతలో స్కూలు దెఱచిరి. ఆ యూసే మఱచితిని. అప్పటికి సంఘము వారి వ్యవధి పది రోజులున్నదనఁగా మిత్రు లీవిషయము దడవిరి. అయినఁ జూతునని రెండు మూఁడునాళ్ళీడ్చితిని. అంతఁ బోక వారు పదేపదే యొత్తిడి చేసిరి. కాలము కఱవులో నా కెట్లు పాలుపోక మిక్కిలి కక్కుఱితి పాలుగావలసి వచ్చినది. అయిన నెట్లో గడువు మేరకు వ్రాసి పంపఁ గలిగితిని.

ఇందలి వస్తువు మెట్టరైతులది. దానినే గైకొను టేల యన ఒకప్పుడీ పల్లపు రైతు మెట్ట రైతు స్థితిలో నున్నాఁడు. అందుచే మెట్ట దృశ్యము లతని కంది పుచ్చుకొన్నట్లుండును, పల్లపువారి యభిరుచు లొకప్పుడితని కర్థము కాక పోయినఁ బోవచ్చును. ఈ కథాసన్నివేశములు కొన్ని నా యనుభవములోనివి. కొన్ని కన్నులారఁ జూచినవి. అభూతకల్పన లిందు మచ్చునకైన లేవు. ఒక సిరిదేవి స్వార్థత్యాగము మాత్రము కల్పితము.

నిరంతరము ఱొచ్చురొదుసుల మునిఁగి తేలు రైతు జీవిత మభూత కల్పనలచే మైలపడును. యథాతథముగఁ జిత్రించిన నూత్నాభిరుచులకు వెలియగును. సిస్తైన రైతు మర్యాదలు గమిడి దాఁటలేదు. గ్రంథస్థములు కాలేదు. పరిగె నేరుకొన్న ట్లేకొన్నో సినీమారంగముల కెత్తు చున్నారు. ఆ బాపతువారి కివి యాశ్చర్యజనకములు గావచ్చును.

రైతు కుటుంబపరిస్థితులు, తదాచారములు, పొలముసాగు, గ్రామవైద్యము, పశుధనము, కొంగు బిచ్చములు, గృహకల్లోలములు, సాహుకారి దౌర్జన్యము, గ్రామాధికారి దౌష్ట్యము, జాయంటు వ్యవసాయ మిత్యాదులు విస్తరింప ననువు పడక అందందుటంకించితిని.

వ్యావహారిక రచన హరికథా ధోరణికిం గొంచె మెడమగుటచే రైతు పరి భాషననుసరించి పూర్వ ఫక్కినే త్రొక్కితిని. అక్కడక్కడం బారిభాషికములలో నియమోల్లంఘన మవసర మనిపించినది.

తెలుంగులోం దిరస్కృతవాఙ్మయ మంతయు ముద్దులొలుకు పాటలలో నిమిడియున్నది. నేటి కీర్తనలును దెలుంగుందెన్నులకు నంత దగ్గఱగా లేవనిపించును. ప్రజాహృదయ మాంచికొన్న యక్షగానాదులు మన సాంప్రదాయ సిద్ధములు. క్రొత్త పోకడలు వలదనికాదు. సాంప్రదాయ మెల్లపుడును బ్రజాహృదయ మూంకొట్టించును.

అందుచే నిందుం బ్రగతి నెక్కువగా వాడితిని. కారణమేమనం బ్రగతినెత్తినపు డెల్లం బ్రక్కవాద్యములకుం బనిగలుగును. మంజరి రాగము సాగున కుపకరించును. గీతము రాగమునకు స్థాయి చేకూర్చును. పాట వీని నన్నింటిని సమకూర్చును. అందులకే వీని కెక్కువస్థాన మిచ్చితిని.

వచనము గొలుసువలె నుండక తప్పినదిగాదు. అది కథకుని సలహా ననుసరింపవలసి వచ్చినది. కథకు లీవచనముల సొంత ధోరణిలో నడపుకొను టాచారము. అట్లే గ్రంథస్థమైనచో గాలికబురులయి తేలిపోవును.

కీర్తన యనునది పరంపరగాం జాయననుసరించి నేర్పాందగినది. నేంటి కది యనియతమగు పాట కత్తుతోం జలామణి యగుచున్నది. ఆ స్థానమున నిందొక దినుసు పాట లుపయోగించితిని. కాని కథలోం బ్రగతికున్న వీలు వేరు వానికుండదు. దీనికి బుఱ్ఱకథలే తార్కాణము. ఆ కథలకు నిది యందుపాటులో నుండవలెనను తలంపుతో రచించితిని. కావున నిది యుభయుల కుపకరించునని నామతము. ఈ నాయుద్యమమును సఫలమొనర్చి సమంజసములగు సలహా లొసంగిన కథాయోగ్యతా నిర్ణేతలగు శ్రీ బెజవాడ రామచంద్రారెడ్డి, శ్రీ జాగర్లమూడి కుప్పుసామి చౌదరి, శ్రీతాపీధర్మారావు నాయుడుగార్లకు నానమోవాకములు.

గ్రంథకర్త

# మండవ వేంకటరామయ్యగారి జీవిత రేఖలు

శ్రీ మండవ వేంకటరామయ్యగారు గుంటూరుజిల్లా చిలువూరు గ్రామంలో 1-3-1931న పేరుగాంచిన వ్యవసాయదారుల కుటుంబంలో జన్మించారు. బెనారస్ యూనివర్సిటీ నుంచి వ్యవసాయ శాస్త్రంలో పట్టభద్రులయ్యారు. ఎగ్రానమీ ప్రధానమైన అంశంగా తీసుకొని M.Sc. డిగ్రీని ఆగ్రాలోని B.R. కాలేజీ నుండి పుచ్చుకున్నారు.

డెప్యూటీ డెవలప్‌మెంట్ ఆఫీసర్‌గా (ఆగ్మార్క్) సెంట్రల్ గవర్నమెంట్‌లో ఫుడ్ అండ్ అగ్రికల్చర్ శాఖలో ఫిబ్రవరి 1957 లో చేరారు. తదుపరి మార్కెటింగ్ ఆఫీసర్‌గా పదోన్నతి పొంది 1963 నుండి 1967 వరకు పని చేశారు. తరువాత ప్రభుత్వ రంగం నుంచి విరమించుకొని ప్రైవేటు రంగంలో కాలిడినారు. 1968 నుండి 1972 వరకు చిలకలూరిపేటలోని కందిమళ్ళ రాఘవయ్య, రామమూర్తి కంపెనీలో బిజినెస్ మేనేజర్‌గా పనిచేశారు. ఆ తరువాత 1974 వరకు నవభారత్ కంపెనీలో లీఫ్ మేనేజర్‌గా పనిచేశారు.

తదుపరి సొంతముగా హైబ్రీడ్ ప్రత్తి విత్తనముల ఉత్పత్తి వ్యాపారమును నూజివీడులో, గుంటూరులో ప్రారంభించినారు.

వీరికి గల అపారమైన వ్యాపారానుభవము వల్ల వ్యవసాయముపైగల అభిరుచి వల్ల భారత ప్రభుత్వ వాణిజ్య శాఖలోని టుబాకో బోర్డులో మార్కెటింగ్ మేనేజరుగా 1978లో పదవీ స్వీకారం చేశారు. మన దేశానికి అనుగుణంగా వుండేటట్లు ఆక్షన్ విధానం నిర్ధారించడానికి రొడేషియా, అమెరికా, కెనడా దేశాలు పర్యటించి అధ్యయనము చేసి వచ్చారు. మన దేశానికి అనుగుణంగా అమెరికా విధానమును అమలు పరచడంలో వీరు ఆద్యులు. మేలైన ప్రత్తి విత్తనములను ఉత్పత్తి చేయుటలో

ప్రవీణులు. ప్రస్తుతము ఆ కంపెనీకి ఛైర్మన్‌గా ఉన్నారు.

వీరు కాటన్ అడ్వైజర్ బోర్డులో రెండు మారులు మెంబరుగాను, రైతుల సమస్యలను తీర్చడానికి కాటన్ ఎసోసియేషన్ డైరెక్టర్ పదవిని అలంకరించారు.

వీరు గుంటూరు పట్టణమందలి పాటిబండ్ల సీతారామయ్య హైస్కూలునకు భూరి విరాళమిచ్చిన విద్యాప్రియులు. నూజివీడులో దత్తాత్రేయ స్వామి ఆలయము నకు, గణపతి సచ్చిదానంద ఆశ్రమమునకు ధన సహాయము చేసిన ఆస్తికవరులు. ఎన్నో బస్సు షెల్టర్సును నిర్మించిన ప్రజా సేవకులు. గ్రంథాలయమును కట్టించిన సాహితీప్రియులు.

వీరి సహధర్మచారిణి శ్రీమతి రమాదేవిగారు కూడా ఆస్తికురాలు. దాన ధర్మాలు ఘనంగా నిర్వహించారు. సచ్చిదానంద గణపతి స్వామిజీ భక్తురాలు. నూజివీడు నందలి స్వామిజీ ఆశ్రమ నిర్మాణమునందు, దత్తాత్రేయస్వామి ఆలయ నిర్మాణమునందు, శ్రీమతి రమాదేవిగారికి విశిష్ట పాత్ర వున్నది.

వేంకటరామయ్యగారికి ఒక పుత్రిక, ఇద్దరు పుత్రులు. పెద్ద కుమారుడు శ్రీ ప్రభాకరరావు M.Sc. డిగ్రీ తీసుకొని "నూజివీడు సీడ్సు ప్రైవేట్ లిమి టెడ్, గుంటూరు"నకు మేనేజింగు డైరెక్టరుగా వుంటున్నాడు. రెండవ కుమారుడైన శ్రీశ్రీనివాసరావు రొయ్యల వ్యాపారము చేయుచున్నాడు.

కవిబ్రహ్మ శ్రీ ఏటుకూరి వేంకట నరసయ్యగారు రచించిన "రైతు (హరి) కథ" ద్వితీయ ముద్రణము వెలుగు చూచుటకు సహకరించిన సాహితీ ప్రియులు శ్రీ మండవ వేంకటరామయ్యగారికి, ఈ "రైతు - (హరి)కథ"ను ప్రచురించుచున్న కవిబ్రహ్మ ఏటుకూరి వేంకటనరసయ్య కవితా ప్రభాస కృతజ్ఞతలు తెలుపుకుంటున్నది.

ఇట్టి వదాన్యులు, మాన్యులు అయిన శ్రీ మండవ వేంకటరామయ్యగారికి, వారి కుటుంబమునకు సర్వేశ్వరుడు ఆయురారోగ్య భాగ్యములను ప్రసాదించుగాక.

ఏటుకూరి రవీంద్రనాథ్

(రిటైర్డ్ డిప్యూటీ కమిషనర్ ఆఫ్ ఇన్‌కంటాక్స్, గుంటూరు)



శ్రీ మండవ వేంకట రామయ్యగారు
నూజివీడు సీడ్స్ ప్రై. లిమిటెడ్
వ్యవస్థాపకులు

# అవతరణిక

పూజ్యులారా!

కాయము గాయమై సురింగి గడ్డకుఁ బుట్టెందు నీరు ద్రావి దీ
ర్ఘాయువుగా శ్రమింపఁగలఁ డార్థిక వేత్తలు తల్లక్రిందులై
పోయిన నెగ్గిరాఁగలండు పుట్టినదాది స్వతంత్ర జీవన
చ్ఛాయల విశ్రమింపఁగల సార్థక జీవికి జన్మమున్నదా!

మన రైతుబాబు అమాయికుండు. కుడు మిచ్చిన పండు వనుకొనును. కాలచక్రపు టొరపిడికిఁ గండ లప్పగించి బయలు కౌఁగిలింప బారలు సాచినాఁడు. చేయూఁతయిచ్చు నాథుండును రాబందువలెఁ గాచుకొన్నాఁడు. ఇఁ కాతని కేది దారి?

మన సమస్త వైభవముల కతఁడే జీవగఱ్ఱ. అతఁడు లేని లోక మంధ కారావృతము. అట్టి మనజీవనదాతను మఱచిపోయితిమి. అతని కష్టగాథను అమరజీవితమును నోరారఁ బాడిన పాపమునఁ బోము. ఇందనుకఁ బురాణ వీధుల నూరేగితిమి. నిత్యము మన కనుల యెదుటఁ దాండవించు రైతుపురాణ మవలఁ ద్రోసితిమి. నేంటి కిదే మన దౌర్బల్యమునకు దారి తీసినది ఇపుడిపుడే

'అందని దివ్యభూములకహర్నిశమి ట్లెగఁబ్రాఁకుచుండు వీ
వెందులకోయి? నందనము లేఁ? యసంగతదేవతాప్సరో
బృందములేఁ? చందనము లేఁ? మరందము లేఁ? జీవి కా
నంద మొనర్చు రైతుభజనమ్మున నీకృతి నింపఁ గూడదా?'

అను మేల్కొలుపులు వినవచ్చుచున్నవి. ఒక వినవచ్చుటేగాదు

'తల్లి క్రిందురైనఁ దాకట్టు పెట్టఁడు
త్రావఁడింత తప్పు త్రోవఁ జనఁడు
సకల జీవకోటి సాఁకు పుణ్యాత్ముఁడు
లోకమందు రైతుగాఁ కెవండు'

అది గమనించి నేఁటి మన ప్రజానాయకులు రైతు రథమును నడిపింప దొరకొనిరి. ఆ నడపుటలో నీ స్యందనము మహోధ్వముల గమించుచున్నది. సామాన్య ప్రజల కందుపాటునకు రాలేదు. ఈ విషయమై యిప్పుడు గుంటూరి సీమరైతు సంఘమువారు చేయుచున్న కృషి యందఱ కందుపాటుగా నుండి యుత్సాహదాయకముగా నున్నది.

ఈ సంఘమునకు వెన్నెముకయై వ్యయప్రయాసల కోర్చి రైతును ముందు కుఱికించు సర్వప్రయత్నము లొనర్చువారిలో శ్రీ ఆలపాటి సూర్యనారాయణ చౌదరి గారు ప్రశంసార్హులు.

ఎడ్లకుఁ బోటీలు పచరించియుఁ, జేతిపనులకుఁ జేయూఁత యిచ్చియు, రైతు కథల వ్రాయించి బహుమతులిచ్చియు, నటుసేద్యము నిటు రైతు వాఙ్మయమును జోడించి కవులను, కథకులను, రైతు యాత్రికులను దయారుచేయు వీరు కడు ధన్యులు.

వీరి కన్ని విధములఁ జేయూఁత యిచ్చి యీయుద్యమమునకు బ్రహ్మరథము పట్టు గోవాడరైతుబాబు లాంధ్రుల కాదర్శప్రాయులు. వారి నీకథాముఖమున స్మరించి ధన్యవాదము లర్పించుచున్నాను.

# ద్వితీయ ముద్రణము

కవిబ్రహ్మ శ్రీ ఏటుకూరి వేంకట నరసయ్యగారి మానస మహాక్షేత్రములో మొలిచిన కవితా వృక్ష ఫలములలో **'రైతు'** అను హరికథ ఒకటి.

రైతు జీవన విధానమునకు నిలువుటద్దమైన ఈ హరికథను 1942లో **"గుంటూరి సీమ రైతు సంఘము - గోవాడ"** ప్రచురించినది. ప్రప్రథముగా ముద్రించి వెలుగులోనికి తెచ్చిన ఈ రైతు సంఘమునకు మా సంస్థ కృతజ్ఞతలు తెలుపుచున్నది.

ఇప్పుడు రైతు బాంధవులు శ్రీ మండవ వేంకట రామయ్యగారి చేతి చలువతో ఈ కృతిని పునర్ముద్రించు భాగ్యము మాకు కల్గినది.

కళావాచస్పతి, డాక్టర్ కొంగర జగ్గయ్యగారు, ఈ కృతికి 'నివాళి' అర్పించుట, ద్వితీయ ముద్రణమందుచున్న ఈ కృతి అదృష్టము.

ఈ పునర్ముద్రణావకాశ భాగ్యమును మా సంస్థకు అనుగ్రహించిన శ్రీ ఏటుకూరి వేంకట నరసయ్యగారి కుమారులు శ్రీ రవీంద్రనాథ్‌గారికి (రిటైర్డ్ డిప్యూటీ కమీషనర్ ఇన్‌కంటాక్స్); వారి కుటుంబ సభ్యులకు మా కృతజ్ఞతాపూర్వక నమస్కారములు.

మాకినేని ప్రసాదబాబు
సంయుక్త కార్యదర్శి
కవిబ్రహ్మ ఏటుకూరి వేంకట నరసయ్య కవితాప్రభాస,
గుంటూరు

గుంటూరు
అక్టోబర్ 1994

# నివాళి

'కళావాచస్పతి'
డాక్టర్ కొంగర జగ్గయ్య

ఏటుకూరి వేంకట నరసయ్యగారి కావ్యాలలో పలనాటి భారతగాథలు ప్రసిద్ధమైనవి. వాటిని చదివిన ప్రతి తెలుగువాడూ పులకించిపోవడం సహజం. ఆధునికాంధ్ర సాహిత్యంలో ఆ వీరగాథలు ఆణిముత్యాలు. కాగా, వారి ఇతర రచనలు క్షేత్రలక్ష్మి, రైతు (హాలి) కథ - మరొక కోవకు (GENRE) చెందినవి. అవి రైతు కావ్యాలు. అయినా, కావ్యలక్షణాలలో కాని, ప్రయోజనంలో కాని, రసనిర్వహణలో కాని, వారి తరువాతి రచనలకు అవి ఏమాత్రం తీసిపోవు. నరసయ్యగారి నిసర్గ కవితా వ్యక్తిత్వానికి అవి మచ్చుతునకలు.

నరసయ్యగారు కర్షక కవి. తెలుగులో కర్షక కవులు చాలా అరుదు. ఆ కాలపు బమ్మెర పోతన్నగారు, ఈ కాలపు తుమ్మల వారూ, దువ్వూరి వారూ, ఏటుకూరి వారూ వంటి కొద్దిమంది తప్ప. వీరిలో, రైతుగా పుట్టి, రైతుగా పెరిగి, రైతు హృదయాన్ని ఆవిష్కరించి, రైతుగానే మిగిలిపోయిన ఏకైక కర్షక కవి ఏటుకూరి వేంకట నరసయ్యగారు. "కర్షక సార్వభౌముడే, అంతము లేని యీ భువనమంతకు శాసనకర్తయై, నిరభ్యంతర పాలన మెన్నన రుక్షపం కల భాగ్యము" కోసం కలలు కన్న కర్షక వైతాళికుడు. పల్లె బ్రదుకుల పరువానికి, గరువానికి

సాహిత్యంలో పెద్ద పీట వేసిన పలనాటి కవి.

నరసయ్య గారు సమన్వయ వాది. "పురాణ మిత్యేవ నసాధు సర్వమ్, న చాపి కావ్యమ్ నవ మిత్యవద్యమ్" అన్న కాళిదాస సూక్తి వారికి స్ఫూర్తి. అందుకే "యాప్లి సదల్ప కిప్పటి విధుల నరసింపక, పాత కొత్తలలం దుల్లము జెప్పి, దేశి కవి హోచిత మార్గము లంగమించుట" తమ ఆదర్శంగా చాటుకొన్నారు. తమ కావ్యాలన్నీ ఆ బాటలోనే నడిపారు. తాము సంస్కృతాంధ్రాలు రెంటిలోనూ మహా పండితులై ఉండీ, తమ కావ్య భాషగా జానపద భాషనే, జాను తెనుగనే ఎన్నుకొన్నారు.

నేను దుగ్గిరాల హైస్కూలులో చదువుకొనేటప్పుడు మొదటిసారిగా వేంకట నరసయ్య గారిని చూచాను. అంటే సుమారు 55 ఏండ్ల క్రితం మాట. అప్పట్లో ఏటేటా మా హైస్కూలులో జరిగే ఉపాధ్యాయ పండిత పరిషత్తుకు వారు హాజరయ్యేవారు. ఆ తరువాత దుగ్గిరాలలోనే వారి "నాయకురాలు" కావ్యాన్ని, మా వ్యాకరణ గురువులు శ్రీ జంపాల వేంకట నృసింహం గారికి అంకిత మిచ్చిన సందర్భాన జరిగిన ఉత్సవంలో వారి పరిచయ భాగ్యం లభించింది. ఆ నాటి నుంచీ వారి పట్ల ఎనలేని గౌరవమూ, వారి కవిత్వం పట్ల చెప్పలేని అభిమానమూ నాలో చోటు చేసుకున్నై.

ఈ "రైతు (పాట) కథ", 1941 సంవత్సరంలో

గుంటూరు జిల్లా రైతు సంఘం వారు జరిపిన పాటకథల పోటీలో ఉత్తమస్థానం సంపాదించి, నేటి పదార్థ బహుమతి గెలుచుకొన్నది. అంతకు ముందే "క్షేత్రలక్ష్మి" ద్వారా వెంకట నరసయ్యగారు రైతు కవిగా ప్రసిద్ధులైనారు. కాగా, 1942 లో ఆ వారిలో జరిగిన పెద్ద బహిరంగ సభలో వారికి అపూర్వమైన రీతిలో "కవిబ్రహ్మ" బిరుద ప్రదానం జరిగింది.

వెంకట నరసయ్య గారి చిన్న కావ్యానికి మెట్ట రైతు జీవనాన్ని వస్తువుగా తీసుకొన్నారు. మాగాని రైతు కూడా ఒకప్పుడు మెట్ట రైతు గానే బ్రతికిన వారు కనుక, రైతులందరికీ యిది అన్వయిస్తుంది అని వారి నిర్ణయం. ఇది వాస్తవికతను కాలబోసికొన్న రచన. "అభూత కల్పనలిందు మచ్చుకైన లేవు" అని వారే స్పష్టం చేశారు. బహుశా 1937, 38 లలో ఆంధ్ర దేశ మంతటా వెల్లువెత్తిన జమీందారీ రైతు ఉద్యమ ప్రభావం, వీరి 'క్షేత్రలక్ష్మి', 'రైతు కథ' లకు మరింత ప్రేరణ కలిగించి ఉండవచ్చు.

గ్రామీణ జీవనమంతా రైతు జీవనం చుట్టూ పరిభ్రమిస్తుంది. కనుకనే ఈ కథలో రైతుల కష్టసుఖాలు, పనిపాటులు, వారి నమ్మకాలు, ఆచారాలు, మర్యాదలు, మనస్తత్వాలు – ఒకటేమిటి – వారి జీవన వ్యవస్థనంతా గుండెలకు హత్తుకొనేటట్లుగా చిత్రించారు నరసయ్యగారు.

ఈ కావ్యం ద్వారా వారు ప్రబోధించిన ముఖ్యాంశాలు మూడు:

మొదటిది: రైతుకి నేల కన్నతల్లి వంటిది; గొడ్డూ, గోడా కన్నబిడ్డల వంటివి. పంటపొలం నుండి రైతు జీవితాన్ని విడదీయడం అసాధ్యం. అలాగే దుక్కిటెద్దూ, పాడిగొడ్డూ వాని సిరిసంపదలు. వాటి మధ్య అనుబంధం, ఆప్యాయతా వెలకట్టలేనివి. ఈ సంబంధాలు సవ్యంగా సాగినంత కాలం రైతు జీవితం సరిచెడదు; గ్రామీణ జీవితంలో EQUILIBRIUM కూడా చెడదు. ఈ ప్రాయికసత్యాన్ని ఈ కథలో కరుణరసాత్మకంగా మలచారు కవిగారు.

రెండవది: రైతులకు సమస్యలున్నట్లే, వ్యవసాయ కూలీలకు కూడా సమస్యలున్నాయి. అయితే అవి పరస్పరాశ్రితాలు; విడదీయరానివి. వీటిలో ఏ ఒకటినీ ఉపేక్షించడం తగదు. ఇరువర్గాల మధ్య సామరస్యమే, సౌమనస్యమే గ్రామ సౌభాగ్యానికి పునాది. నరసయ్యగారి శిలాసభలో ఇది ముఖ్యాంశం. 'క్షేత్రపుత్రి' లో విపులంగా చర్చించిన ఈ అంశాన్ని, ఈ కథలో వారు UNDERCURRENT గా ఉంచారు.

ఇక మూడవది: రైతుల సమస్యల్ని ప్రస్తావించడంతోనే ఆగిపోకుండా, నరసయ్యగారి కథలో వాటికి పరిష్కార పథాన్ని కూడా సూచించడం. ఈ కథాంతంలో సిరిదేవి తన యావదాస్తినీ రైతు సంఘ స్థాపనకు ధారపోస్తుంది. సంఘవిధుల్ని కూడా నిర్దేశిస్తుంది.

అది నరసయ్యగారి ప్రణాళిక. అంతే కాక, సన్నకారు రైతుల సమస్యలు తీర్చడానికి 'జాయింటు వ్యవసాయం' చక్కని దోవగా సూచించి, "ఇట్టిదే ధ్యేయమైన నెంచవలయు!" అని ప్రోత్సహించారు. ఇవన్నీ ఒక రైతుగా, రైతాంగం క్షేమం కోసం వారు ప్రతిపాదించిన అభ్యుదయ సూత్రాలు; రాగల కాలానికి మేలుకొల్పు. కవి 'క్రాంత దర్శి' కదా!

నరసయ్యగారు ప్రజాపక్షపాతి. కనుకనే ప్రజల భాషను గౌరవించారు, స్వీకరించారు. ప్రజల వాడుకలో ఉన్న సిసలైన తెలుగు పదాలను ఏర్చి కూర్చి, వాటికి సాహిత్య స్థాయి కల్పించిన ఘనత వారిది. మేము ప్రజా భాషలో ప్రశస్తమని జబ్బలు విరుచుకొనే ఈనాటి రచయితలు చాలా మంది వారి నుండి నేర్చుకోవలసింది ఎంతైనా ఉంది. వారు వాడిన పదాలు చాలా వరకు నిఘంటువులలో కనిపించవు; వ్యాకరణానికి అందవు. అవన్నీ వారు తెలిసీ, కావాలని చేసిన ప్రయోగాలు. "ప్రయోగ మూలం హి వ్యాకరణమ్" అన్న ధీమా వారిది. జానపదుల జీవనాన్ని చదవగలిగిన వారికే, ఆ ప్రయోగాల్లో స్వారస్యం అర్థమౌతుంది.

THOMAS GRAY అనే ఆంగ్లకవి, కవిత్వాన్ని— "THOUGHTS THAT BREATHE AND WORDS THAT BURN" అని

నిరూపించాడు. నరసయ్యగారి విషయంలో అది అక్షరసత్యం. వారు రైతుబాబును గురించి వ్రాసినా, వీరగాథలు ప్రవచించినా, అడుగడుగునా మనకు సజీవసన్నివేశాలే సాక్షాత్కరిస్తాయి. గుండెల్ని పట్టుకునే ప్రయోగాలు మనల్ని కుదిపివేస్తాయి. పల్లెటూరి పలుకుబడులు, తీయని నానుడులు, కమ్మని నుడికారాలు, [illegible] పరిభాషలు- ఆ కవితా సాగరంలో మనకు పుష్కలంగా లభించే రత్నాలరాసులు.

ఈ రైతు కథలో వారు చేసిన ప్రయోగాలు కొన్ని చూడండి: చిలకొట్టు, ఒరగడుగు, వెదపెట్టు, పిప్పిగడ్డ దన్ను, అప్పచ్చులు, ఆకలి మెక్కు, సెలవేయు, ఇల్లెలపాడి, ఊచ్చు ఊడుపు, పంటి తుత్తర, వరగాలి, మూలగలో ఉడుకెత్తుట, చేకటి తప్పు, సత్తుగా తినుట, తలచెక్క చిక్కు, యువదాష్టి, కడుపు నాయుగట్టు - ఇది రైతుల భాష, ప్రజల భాష, నిజమైన తెనుగు భాష!

అంతే కాదు. జోడు = తేత జొన్న కాడలు; పునాస (పునర్వసుకు అపభ్రంశం) పైరు = పునర్వసు కార్తెలో - అనగా జ్యేష్ఠ మాసం చివర, ఆషాఢం మొదట్లో విత్తిన పచ్చ, త్రైద [illegible] పంట — వగైరా పదాలు ఈనాడు ఎంత మంది గుర్తించగలరు? ఇక సిరిదేవి పసిబిడ్డగా "పట్టు కుచ్చు వతె బల్లు చేసిం"దట! ఆ తరువాత "గొగ

కొమ్మ విధాన గోముగా పెంచినం" దట! వయసు వచ్చిన నీటిదేవి చేతివేళ్లు "పెసరకాయల వలె" ఉన్నాయట! ప్రబంధ సంప్రదాయ వలయాల్లో పొరలాడే కవీశ్వరులకు ఈ ఊహలూ, ఉపమానాలూ మెత్తని చెంపపెట్లు! పచ్చి పట్టుల గుబాళించే సుతారపు ముచ్చట్లు!

వేంకట నరసయ్య గారు అసాధారణ ప్రజ్ఞాశాలి. పాత్ర పోషణలో, దేశ్య పదపాలనలో, ధారలో పూర్వ కవి ప్రయోగాలకు ఏకటా తీసిపోని అభినవ కవిబ్రహ్మ వారు. వర్ణనలలో, 'హాస్య మధురిమ'లో, నుడికారంలో, చమత్కారంలో. చేమకూరకు జోటు మన ఏటుకూరి. ఆధునాతన కవులలో సీసపద్యాన్ని కనువిందుగా, వీనులవిందుగా కదను తొక్కించిన ప్రజ్ఞామూర్తులిద్దరిలో ఒకరు. "ప్రాత పుంతల మీద బడి యాత్ర సాగించు, కైతకాండ్రకు క్రొత్త గతులు చూపిన" స్రష్ట. "పచ్చి తెనుంగు కావ్యముల వ్రాసిన" ఖ్యాతయౌ కవి. అందుకే వేంకటనరసయ్య గారు నా దృష్టిలో "కవీనాం కవిః."

అటువంటి మహాకవికి నివాళి పట్టే బాధ్యతనాపై మోపిన వారి కుమారులు శ్రీ ఏటుకూరి రవీంద్రనాథ్ గారికి నా కృతజ్ఞత నివేదిస్తున్నాను. ఈ రైతు కథ పునర్ముద్రణకు పూనుకొన్న సహృదయులు శ్రీ వేంకట రామయ్య గారి విజ్ఞతను మనసారా అభినందిస్తున్నాను.

కడపటి మాట. కవిగా వేంకట నరసయ్యగారికి రావలసినంత ప్రాచుర్యం రాలేదు. అది వారి తప్పుకాదు. వారి మరణానంతరం వారి కవితా ప్రభావాన్ని మరచిపోయిన ఆంధ్ర ప్రజలది. అమూల్యమైన తమ సంస్కృతిని పదిలం చేసుకోవడం చేతకాని తెలుగు జాతిది. అయితే, ఇటీవల వారి సాహిత్యం పట్ల విద్యాధికులలో ఆసక్తి చిగురిస్తూ ఉండటం ఆశాజనకమైన పరిణామం. ఆ ఆసక్తి అన్ని వర్గాలలోనూ అల్లుకోవాలి. వారి కావ్యాలు చాలా వరకిప్పటికీ అందుబాటులో లేవు. అముద్రిత గ్రంథాల్లో ఉన్నాయి. అవన్నీ వెలుగులోకి వచ్చి, విశ్వవిద్యాలయ స్థాయి నుండి గ్రామ గ్రంథాలయ స్థాయి వరకు బహుళ వ్యాప్తి పొందాలి. నరసయ్య గారి కవితా గంగ నాలుగు చెరగులా పొంగి, తెలుగువారి గుండె పొలాలను సరికొత్తగా పండించాలి.

“జయన్తి తే సుకృతినో రససిద్ధాః కవీశ్వరాః”

---

మదరాసు,
మే, 1944.

అంకితము

...................

# రైతు బిడ్డకు

తల్లక్రిందులైనఁ దాకట్టు పెట్టఁడు

త్రావఁడింత తప్పుత్రోవఁ జనఁడు

సకల జీవకోటి సాఁకు పుణ్యాత్ముండు

లోకమందు రైతుగా కెవండు?




(హరికథ)

## తొలిపాలు

గీ. సిరులు చిందెడు గుంటూరి సీమలోని
పేరు మ్రోసిన యొక పల్లెటూరి యందు
రాయుఁడను పేరు గల చిన్న రైతు గలఁడు
మచ్చునకుఁ దచ్చరిత్రమ్ము ముచ్చటింతు.

గీ. పూర్వు లిచ్చిన కొండ్రనే పొదుపుచేసి
గుట్టు చక్కఁగ నిలు దిద్దుకొను నతఁడు
తాత తండ్రుల మోస్తరే తనహయాము
ఒడుదొడుకు లేక తిన్నఁగా నడిపినాఁడు.

గీ. తాను పూర్వుల బలెనె నిశానుదారు
అయిన లోటన్న దెఱుఁగఁ డాహాలికుండు
తెచ్చి పెట్టెడు తల్లి భూదేవి గలదు
తనివి దీఱ భుజింపఁగాఁ దాను గలఁడు.

గీ. పాప మా రైతు బిడ్డ దౌర్భాగ్య మేమొ?
పుట్టి గిట్టిరి నల్వురు బుడుత లవలఁ
గడుపు పండకపోయిన కారణమున
మేర దక్కిన గ్రుక్కిళ్ళు మ్రింగఁ జొచ్చె.

## ప్రగతి

అతని భార్య గోవిందమ్మకు సరి యా యూరం గనుపడదు
మెత కను మా టాయింటిలోపలన్ మెదలెదు గాలికె లేదు
కష్టపడక మఱి కడుపు నిండ దని కనిపెట్టిన దిల్లాలు
అష్టైశ్వర్యము లెఱుంగ దామె కింతన్నము దొరకినఁ జాలు

ఎంతయుఁ బ్రొద్దున లేచి ముందుగా నేకుల రాటము పెట్టున్
కాంతుండు రేచీలేవక మున్నే గడ్డపెరుఁగుఁ జిలకొట్టున్
బల బల మని తెలవాఱు చుండఁగాఁబాఁచిపనులు నెఱవేర్చున్
కల గల మొగమున బొట్టొకింత యిడి కాంతుని మదిలోఁ జేర్చున్
మప్పితమ్ముగా జొన్నలొ? సజ్జలొ? చిప్పలుపడఁగా దంచున్
అప్పుడపుడ యొరగడిగి గుండ్రలన్ దెప్పలుపడ గాలించున్
చిట్టు, తవుడు నిడి పాఁడిగేదెలకుఁ జిక్కని కుడితిం ద్రాపున్
కట్టుఁద్రాళ్ళ నిడి గొడ్డుగోదలకు గడ్డిగాదమును మేపున్
వడివడిగాఁ బ్రొద్దెక్కు లోఁగడన్ వంటఁ దయారొనరించున్
ఉడుకు మెదుకుఁదిని పతి కన్నము గొని మడకచేని కే తెంచున్

## మంజరి

ఇల్లాలు చనుదెంచు టల్లంతఁ జూచి
కోపుటెద్దులఁ దోలికొని వచ్చి మగఁడు
కుంటగట్టునఁ జెట్టుకుం గట్టివైచి
సందెడు జా డెడ్ల ముందు విదిల్చి
కాళ్లు మోముం దోమి గట్టెక్కినంత
ఇంతి మామూలుగా గొంతుగూర్చుండి

పప్పుపచ్చడివాయిఁ బదునురాఁ బిసికి
బక్కనీళులబువ్వఁ బలుచఁగాఁ గలిపి
కడుపారఁ బెట్టినఁ గుడిచి రాయుండు

గ్రుక్కెడుపాగ ద్రావి కూర్కుచున్నంతఁ
దంయుంటు సంటులు మలిగించి భార్య
మబ్బుపట్టిన దంచు మగని మేల్కొలిపి
గడ్డిగాదము గోసి కాడంత మోపు
ఎత్తించుకొని యింటి కేతెంచుచుండుఁ
జీఁకటిపదుదాఁక సేద్యమ్ము నెఱపి
అసురుసురై రాయఁ డరుదెంచుచుండు
ఎటు ప్రొద్దు పొడిచిన దెఱుఁగ కిర్వురును
ఈరీతిఁ గాఁపుర మీఁదుచున్నారు.

కొంత కాలమ్మునకు రాయనిలోఁబుట్టు వెంకటమ్మ మగండు గతించుటం జేసి యేయుండయు గానక యప్పటి కెదబిడ్డం డగు వెంకటాద్రిం దోడ్కొని యున్న మఱుంగుసొచ్చి క్రమక్రమంబున దిగులు దొఱంగినదై మగరాయనింబలె నింట బైట నెల్లకడలఁ దానయై యున్న కాఁపురము దిద్దుచున్నంత,

ప్రగతి

ఆఁదుబిడ్డ మూఁలమ్మునఁ గష్టము లన్నియు విఱుగుడు లయ్యెన్
వేదుకపడి కాఁపురమందునఁ జెయిచేసిరి, గర్భం బయ్యెన్
మిక్కుటమగు తమకమ్మున గ్రుక్కలు ప్రింగిసాగి రంతంతన్
కక్కులుడిగి నీళ్ళాడు ప్రొద్దులై గలిగె నాఁడుశిశు వంతన్
కుక్కిలోనఁ బన్నుండిన రాయని గుండెలు వెఱువైపోయెన్
చక్కని మగమొల్కకునై పాపము సంబరపడ నిటులాయెన్
పుట్టి చేటలోఁ బడిన యదృష్టము పురిటినీళ్ళతో హెచ్చెన్
పట్టుకుచ్చువలె నొళ్ళుసేసి పసిబాలిక చాయకు వచ్చెన్
ముక్కు మొగము తీరంత తల్లియని మురిసిరి చూచినవారల్
తక్కిన దా మేనత్తవాలకమె తప్ప దనిరి నగువారల్
ముద్దుబిడ్డ కేపేరు నచ్చునని ముగతెగరై పలుసారుల్
పెద్దలపేరులు మోటని కొందఱు పెట్టిరి యెన్నో పేరుల్.

ఈ ముగ తెగ రెంతయుం గాదని వెంకటమ్మ నెలవెళ్ళు జాతల సోదె యడిగి పిల్లముత్తవ సిరిదేవిపేర్వెట్టి తన బిడ్డకుంగా నన్నవే బాసలు చేయిం చుకొని ముక్కు చెవులు గుట్టించి జిట్టునం జీదకుండ గన్నులం గప్పకొన్నెడ నప్పిన్న దింతింతమైనం గొన్నాళ్ళపాటు

సీ. అరికంఠమూడ్చి బాలాతపమ్మునం గ్రాంగు
అల్లుంగూంతుల నవ్వులాటం గాంచి
చలిదికెత్తుంబీటం గొలువై పరస్పర
మ్మెంగిళుల్గుడిచి యుప్పొంగు టరసి
పైనం బ్రక్కనం బండి పల్లద్దమున వింత
పోకిళ్ళతోం బ్రొద్దుపుచ్చు టెఱింగి
చుక్కబొట్టుంలనీడం జూచి బాగోగులు
సవరించుకొనెడి దృశ్యములు గాంచి
పొదుపు కథలకుం దగు నెత్తిపొదుపుంకును
గువ్వపిట్టంబలెం బెనంగొనుటం దెలిసి
అధిక సంతోషభరితులై యాలు మగండు
చూచి చూడక కాలమ్ము ద్రోచుచుండ

మంజరి

గోంగుంగొమ్మ విధాన గోముగాం బెరింగి
కన్నెగేదంగి వోలెం గలకలలాడి
చేమంతిపువు లాగు సింగార మెులికి
చిగురు పొట్లము రీతి జిగి వెల్లిగొలిపి
పాలపూసల నాంటి ప్రాయమ్ము దాంటం
జీర సింగారింమ సిరిదేవి మేన
సౌందర్య దేవత సాక్షాత్కరించె.

తదాది సిరిదేవి వెంకటాద్రితోం జనవు దొఱంగి అతండు నిలువరించినం దలవంచుమ, నెదురుపడినం దొలంగి చనుచుం, బలుకరించినం బులకరించుచుం

జూచీ చూడక, పలికి పలుకక యూకు మఱుంగు పిందెయై తల్లిదండ్రుల చాటున సిగ్గుందెరలం జిక్కి ముద్దరాలివలె మనసీక పెనంగు ముద్దు కోడలి వలపు వాసనల కగ్గమై మలమల మఱుంగు వెంకటాద్రి వింతవాలకము దల్లి గమనించి,

గీ. తనకుం గల యుబ్బసంబును దలంచుకొనుచు
మంచి చెడ్డలు చూడంగా మనసు గలిగి
మెల్ల మెల్లన రాయని మెడలు విఱిచి
ఇర్వురుకుం బెండ్లిసేసిన దిష్టపఱచి.

## మంజరి

ఇద్ది గోవిందమ్మ కిష్టమే లేదు
తమ్ముల కిమ్మని తగవు లాడినది
తమ్ముండు గోపయ్య తగనివాండైనం
బుట్టిల్లు దూరమైపో నొప్పుకొనదు
మగని కా చెల్లెలే సిగపూవు గనుక
వెంకటమ్మదె యింటం బెత్తనమ్మగుట
పిల్ల కితని మీందం బ్రేమ చొప్పుదుట
తప్పింపంగా బ్రహ్మతరము గాలేదు.

ఆ. చిన్ననాంటి ప్రేమ సిగ్గెఱుంగదు గానం
గలసిమెలసి మున్ను మెలంగినారు
ఇపుడు పెండ్లికతన నిన్నాళ్ళవలెం గాక
క్రొత్త చేసె వారి చిత్తములకు.

## ప్రగతి

ఇంతలోనం దొలకరి యేతెంచిన దీంతల మ్రోంతల తోడన్
సంతసమున ముయిగట్టుల పండువు సలిపిరి ప్రజ లాడాడన్
ఏరువాకకై వెంకటాద్రి కోడేరు వేసికొని సాగెన్

తీరా పసుపుం గుంకమ గొని సిరిదేవి యరక కెదు రేఁగెన్
విత్తనములు జడ్డిగముం గొని వెనువెంటనె రాయం డరిగెన్
దుత్త నీళ్లతో వెంకటమ్మ తోడ్తో వెదపెట్టుట కరిగెన్.

ఆ. గరువునేలఁ బిప్పిగడ్డ దన్నిన దంచు
రేగడంబునాస సాగినారు
వెంకటమ్మ గింజ వెదపెట్టు చుండఁగా
గొట్టుదున్నె నామె కొడుకుఁగుట్టు.

ఆ. గొత్తి పట్టె మేర గుంటక దిగనాడి
చాయ చాలు పట్టె రాయఁడంత
ఏను గ్రుంకి యంద ఱింటిమొగంబైరి
కదుపువిచ్చు లోన కసరుకొనగ.

వీరు వచ్చునంతలో గోవిందమ్మ సజ్జ రొట్టెలం గాల్చి మానిక చెంబుల నీరునించి యెదురుసూచుచుండ నింతలో గుమ్మము దాపునఁ గోడేరు బుట్టు మన్న జాడ విని సిరిదేవి తల్లిని హెచ్చరించి మంచముల్ వ్రాల్చి తల కొక నాలు గప్పచ్చులచొప్పునఁ బేరునేతి గడ్డలన్నింపిన సిబ్బి రేకులు మంచపుఁ బట్టెలం బెట్టి మెట్టున కానుకొని కుడివలన వింతమోరగా నిల్చినది. అంతట నల్లుండు న్మామయున్గోడేరు సర్ది చప్పన నీ రుమిసి మంచములఁ జేరగిల్లి 'పునాస పసిగాఁ బడ్డదా' యను గోవిందమ్మ మాట యూఁ కొట్టుచు రొట్టె తుంపుల కమ్మదనమ్మున కుచ్చిళ్ళుగొట్టుచు గరగర నమిలి గటగట నీరు ద్రావి కాసంత సేద దేఱి రటుపిమ్మట న్మసలఁ గ్రాఁగిన నీళ్ళకాగు లాఱుబైటఁ బెట్ట నిర్వురుం దడుపు లందుకొని స్నాన మాడునెడ,

ఆ. వీపు దోమ వేమె? వెట్టిపిల్లా! యంచు
మగని దగ్గఱకుఁ గొమార్త నంపి
తల్లి తిండివెట్టఁ దరలె నట్టింటికి
రాయఁడామె వెనుకఁ బోయినాఁడు.

ఆ. కన్ను పొడుచుకొన్న కనరాని చీఁకటిన్
భర్త చెంత సిగ్గు పడుచు నిల్వఁ
జిలకరించె నీళ్ళు సిరిదేవిపై నతం
డింత చిలిపివాఁడ వేమిటయ్య!

కం. మీ యమ్మ వచ్చుచున్నది
ఏమనుకొను సందు దొరికెనే యిట్లైనన్
మామా! పోయెద'సుమ్మని
మో మటుగాఁ జేతు లిటుగ ముసిముసి నగుచున్

ఆ. కాలు కదిపినట్లుగా నటించిన భార్యఁ
గొంగుపట్టి తిగిచికొనె నతండు
"అమ్మ! అన్న మిడితి నాఁటిపోవునురం"డ
టంచుఁ దల్లి పిలువ నాత్రపడుచు.

ఆ. మగని యారటంబు మదిలోఁ దలంచుచు
ముద్దుసేసి నవ్వు మోముద్రిప్పి
సిగ్గుపడి ఓరాన సిరిదేవి వెళ్లఁగా
శంకపడుచుఁ జనియె వెంకటాద్రి.

మంజరి

అల్లునకు న్మామ కందుపాటుగనె
పలక పీటల ముందుఁ బళ్లెము ల్వెట్టి
అఱగ దంపిన ప్రాంత వరిగ యన్నంబు
పట్టెదుప ప్పల్లిపాయుకారంబు
కమ్మని నేయి రేగడి గడ్డపెరుగు
వడ్డింపఁగా నొట్టి యొట్టిగాఁ దినిరి
మగవారు దిన్న పిమ్మటఁ దెరల్ దొలిపి
గుంత గిన్నెల కోపినంత పెట్టుకొని

ఆఱుబైట భుజించి రాడంగు లెల్ల
పవలంత తెగంబాటు పడినారు గానం
బ్రక్కం జేరంగ నిద్రపట్టె నందఱకు
సిరిదేవి మటుకు నిశీథమ్ము దాంక
పతిచేష్ట లాత్మలో భావించుకొనుచు
తీయని తలంపులన్ దిగ్రమింగికొనుచుం
దెలవాఱుగట్లకుం దల్రవాల్చె, నట్లె
వెంకటాద్రియుంగూడ వేగించినాండు
పెండ్లైన యేడాది పెద్దవారైన
అక్కఱ దీర్చరాదని నిర్చుచుండ్రు
ఈ కట్టుపాట్లు ముందేమి కాంగలవొ?
ఇప్పటి దురవస్థ కేది మార్గమ్ము?

ఆ. ఎదుట నున్న వఱకె యిటువంటి తగులమ్ము
పాటుపడెడురైతు బాబులకును
చాలవఱకు వారిచే రేమొ? చెల్లేమొ?
తదితరమ్ములకును దావులేదు.

గీ. విత్తనము సొంతము న్మొలకెత్తుదనుక
మంగలము నంటరాదు భామందురాలు
క్షౌర మనంగూడ దేర్పాక సాగునతండు
ఇందులకు వెంకటాద్రి దీక్షించె నవల.

గీ. లరువుగా జల్లువడి పదునైన పొలము
దుక్కిసాగిరి కర్షకు లక్కడకడం
దన చిచింద్రీలవంటి యెడ్లను గదించి
వెంకటాద్రియు దున మొదల్పెట్టినాండు.

ఆ. కాలకర్మ మేమి చాలకపోయెనో?
గడ్డ దన్ని యేడికట్టు బెడిసి
దాపటెద్దు బెదరి తలక్రిందులై మేడి
కట్టు పడియెం గోడె కాలిలోన.

## ప్రగతి

వెంకటాద్రి కప్పుడె ప్రాణంబులు విలవిల మింటికిం బోయెన్
అంతె వేసి కటికోడె జబ్బు లల్లాడించుట భయ మాయెన్
లాడిగాటినటు నెత్తుటి వట్టాడాడం జాళ్ళలోం జొచ్చెన్
చూడ రేక తా బిక్క మొగంబిడి కాడి మూసికొని వచ్చెన్
నీళ్లు దెచ్చుమన్ రాయుం డిది గని నిట్టూరుపులం బుచ్చెన్
కాళ్ళుకుప్పవడి వెంకటమ్మ గలు గానక వాపోంజొచ్చెన్.

ఆ. వారు వీరు చూచి వైద్యమ్ము సెప్పిరి
చెప్పినట్టిదెల్లం జేసినారు
చేయుచున్న కొలంది సెలవేయుటే గాని
ఫలము గానరాదు వలసినంత.

ఇట్లు దినంబులు గడచినకొలంది కోడెకాలు పర్వతం బయిపోవ నింకం గేవునకు రాదని యిల్లెలపాది బెంగపడియె. అందును వెంకటాద్రి పాలము పుట్రలపై ధ్యాస దొలంగి గుండె కూడు పట్టక కోడెతోడిదే లోక మ్మని మందు మ్రాంకులు గూయుచు సదా చావడిలోం గోడె కెదురుగా మంచముపై ముసుగిడి మఱి మఱి మఱుంగుచుందు నింత యెందుల కంటేని

సీ. ఇది పుట్టినది మొద లింటిలో మంటిలో
ముట్టిన దెల్లను ముత్యమయ్యె
ఆఱు చేసిన దాది నాటైన నూటైనం
బట్టిన దెల్లను బసిండి యయ్యెం

పనిపాటులం దైనం బ్రాంతైనం గ్రొత్తైనం
బసిబిడ్డ నైనను గసరుకొనదు
అందచందంబులం దణుమాత్రమైనను
వంచన గావింప వలనుపడదు

కాడి మోపిన మెడం లోతు లేదె గాని
మెడ దెగినదాంక వెనువెన్క కదుగు నిడదు
ఇంటం బడి జీవితమ్ము నర్పించుచున్న
దింతకన్నను బంధువు లెవ్వ రన్న.

ఆ. పుట్టి పుడమింబడినపూటనుండియుం గూడం
దల్లి పాలనైనం ద్రావకుండం
బొల్లొ? పొట్టొ? మెసవి పూంటవాంపై లోక
సేవ చేయు బసవ దేవుం డితండు.

ఆ. అతని యొచ్చు యొడుసులం దెల్లవేళల
మునింగి తేం నేర్చుకొనె నితండు
ఇందు నెవరి కష్ట మెవ రాహరింతురో?
స్వార్థపరుండెఱుంగు స్వామి యెఱుంగు

ఆ. చిన్ననాంటి నుండి చిఱుమువ్వ యని పిల్చి
కన్ను దనియ మేపుకొన్నవాండు
ఇంట బైటంగృషికి నెదురీందు మిత్రుల
కిట్టి సానుభూతి కేమి కొదవ?

## ప్రగతి

జడభరతుండు రేడై జన్మించుచునె సాక్ష్య మ్మీఘటనలకు
విడువక కోడె కొనర్చెడు సేవలు విద్దారము లోకులకు
కనుగుంతలు వడి నీరు విడిచినన్ గడుపు దఱిగిపోం దుడుమున్

తనువు నిమిరి చేంజేత మూపురము దట్టుమం గన్నీ ర్విదుచున్
కొండ పందెమునకై యాతం డీకోడెను మోజుగ మేపెన్
వండొకండు గల్పించి దైవ మీ వంతునందన కృపం జూపెన్.

ఆ. కోడె వీయి దప్పి గుండె చెర్వామండం
గొంత పరువు వచ్చి కూరుమండె
అడిగినంత కూలి కదన మిచ్చినంగాని
వఱపు చేసి పురుగు దొరక లేదు.

గీ. వెంకటాద్రికి సైతము లంకనాయి
పొలము తుద కాయుమూండయి పోవునంచు
వెంకటమ్మయు రాయుండు లంకచేని
కొంత సాగించి యెడపడంగోసి కోసి.

గీ. మబ్బు పట్టిన దంమం దబ్బిబ్బులాడి
పిట్ట మేడెముం న్నిల్వ బెట్టుచుండ
దుత్త నుంద్రాయి మజ్జిగం దొనంకులాడ
ఓడ్డ సరిదేవి గొనివచ్చెం బెందలాడ.

## ప్రగతి

పని కుంపగు నని మేడెముపై నిలబడి రాయుం డా దుత్తన్
కొని తెండని నిచ్చెన యూంతగం గైకొని త్రావం బయికెత్తన్
పద్దన గండిని జాల వాంగుబరెం బ్రవహించిన వుంద్రాయిన్
మిద్దె కూస మటు నిల్వ నతండు కొస మేడెము జవ్వునద్రాయిన్

పంటి తుత్తరకు నూంచ బియ్యమెుడింబట్టినన్ని కొట్టించెన్
పంటకట్ట రెగదోపుడు మునుముంబట్టుల మర సాగించెన్
చాకలి మంగలి కొంత కట్టంకు సాగిరి ప్రొద్దటు ద్రాంలన్
మోకుయి దిరుగని మోపు రెత్తుకొని పోయిరి గుండెయ ద్రీలన్.

ఆ. పదిపదాఱురోజు లదవదరై యిట్లు
కోంత లుడిగి కంకి గోసినారు
కొంద తెప్పొ? పప్పొ?కూటికిబ్బందయి
నుఱివిరైన వఱకుందఱకరైన.

ఇయ్యదునున జోగి, జంగము, మాల, మండి మొదలగు చిల్లర జాతులాళ్ళు కెగంబ్రాకి, గింజ, గిట్ర, కంకి, గట్ర, పొల్లు, పొట్టు ప్రోవుచేసికొనుచుండు నందుచే నూరు కితారు దీరియున్న దట్టిమెడ రాయని గుమ్మములో సారంగివాండొకదు కిన్నెర కంఠమెత్తి

తత్వము

ఎన్నాళ్ళు బ్రదికినా యీపాదు కట్టెలకు
ఇహము పరమూ లేదు చిలుకా!
ఉన్న రెన్నాళ్లైన నుపకార మొనరించి
ఊరేగవే? రామచిలుకా!
ముఱికి దేహము చూచి మురిసేవు తరిచేవు
ముందుగతి గానవే? చిలుకా!
ఎఱుక మాలిననాదు ఈవైభవములన్ని
ఏటిపాలైపోవు చిలుకా!
పిల్లయా, పెండ్లాము, తల్లిదండ్రులుగూడ
పెనుభూతములె రామచిలుకా!
వెళ్ళిపోయేనాండు వీరు వారూ గూడ
వెంట రారే రామచిలుకా!

అని పాదుసరికి వెంకటమ్మ రుసరుస లాడుచు వచ్చి 'పుణ్యము పుట్టేందు, పురుగులు తట్టేందు' అని గుప్పెదు మెతుకులు విదిర్చిచన్నది. అపుడే సందున బిందెకు నీరు దొరుపు సిరిదేవి చెవిదోరగించి విని విని యాతత్త్వమంతరాత్మ కన్వయించుకొని నిట్టూర్పుపుచ్చినది. ఆనాండే మాల చెన్నందు చిన్నపరెడ్డి కథ

చెప్పనని జాము ప్రొద్దుపోయి బావి మిట్టలపై జనము కితకిత యొరిసికొన్నది. ఇంతలోఁ జెన్నందు వచ్చి గుమ్మెట లంవరించుకొని కంచుకంఠమెత్తి పోతుదెద్దు లంకెవేసినట్లు కథ ప్రారంభించుచు

## వీరభాణి

సైరా? చిన్నాపారెడ్డీ! నీ పేరే బంగార్వా కడ్డీ?
పెద్ద పెద్ద సరదారు లున్నరూ
పేరు గల జమీన్ దారు లున్నరూ
వారందఱ పేరుత్త బెందురా?
నీ పేరుక్కు తుపాకి గుందురా? ॥సైరా॥

చడ్డీతో బదివేల మందిలో
అద్దు లేక పోరాడినావురా?
దొడ్డవాఁడ వనఁగా మా తెలుఁగుం
గడ్డ వెల్ల బేర్దెచ్చినావురా? ॥సైరా॥

పందె పెద్దు కొఱకై సర్కారుకు
బలిమై పోయిన రైతుబిడ్డఁడవు
ఎందఱున్న నీలా గొకందు బరి
ముందు నిల్చు మొనగాండు లేదురా? ॥సైరా॥
ముసలయ్యకు నీ కథ విన్నంతనె
మూలంగలో నుదుకెత్తుచుందురా!
పసిపాపలు నీ పేరు విన్నచో
పాల్దాగవన్ భయపడుదురు వాహ్వే ॥సైరా॥

ఇవ్వమకుటము విసరు సరికి అమ్మహాజనము గుమ్మయి గుబ గుబ లాడినది. ఈ పాట గాలిపాటున మంచములో నున్న వెంకటాద్రి చెవి సోఁకఁ గోడె గుప్టికి వచ్చి గుండెలు గుబ్బు రన్నవి. వెంటనే వగర్చు ప్రారంభింపఁ దల్లి నాముగుంత సవరించినది. సరిదేవి మాత్రము పాదములొత్తుచుఁ గాళ్ళుకట్టఁ

దల వ్రాల్చినది. రాయు డింక మొప్పము రే దని యా తెలవారుగట్ల బదులు సదులు గూడఁ దీసికొన్నవాఁడై

## మంజరి

కంకి మండె పెకల్చి కళ్లాన నెఱపి
నాల్గు బంతులు గట్టి నలుగఁ ద్రొక్కించి
తొలి మలివలి లోన గింక లాడించి
గొగ్గి కంకులు గొన్ని ముగ్గుగా మెదిపి
ఆయిదాఱు వాయల నట్టిట్టు దులిపి
పొలి నందుకొమ్మని పలికె మాదిగను
మాదిగంకందు కంకి మడమల న్నుసిమి
ములుకోల సవరించి ముంజేతు రెత్తి
గొంతుకలో నూఁగొకింత కాండ్రించి
బంతి దోలెడువారు వంతు పాడంగఁ
బొలిగాని నీ రీతిఁబిలిచె గొంతెత్తి

## పొలిపాట

వలియ వలిమో వలియ రావేలు గంవాడా? రార పొలిగాడ!
రావేలు నీదయ్యా! రాశి మాదయ్యా!
నూవేలు నీవయ్యా! నూగు మాదయ్యా!
వేవేలు నీవయ్యా! వెన్ను మాదయ్యా!
కోటేలు నీవయ్యా! కొండ్ర మాదయ్యా! ॥వ॥

ఎద్దులూ నూర్పంగా మిద్దె రాసూలు
కోడెలూ నూర్పంగా కొండరాసూలు
ఆవులు నూర్పంగా అడ్డరాసూలు
దున్నలూ నూర్పంగా దిన్నె రాసూలు. ॥వ॥

తూరుపూ ఒక వానా తుమ్మెదల మ్రోత
పడమటా ఒక వానా బాజాల మ్రోత
ఉత్తరా నొక వానా ఉఱుముల మ్రోత
దక్షిణా నొక వానా తాళాల మ్రోత ||వ||

మంగళగిరి లాగూ పొంగెరా రాశి
సింహాచలము లాగూ సిగదేలె రాశి
కోటయ్య కొండల్లా కొసదేరె రాశి
బొప్పూడి కొండల్లా పొడుగయ్యె రాశి ||వ||

దాగెరా పొలిగాడూ తలకాడి క్రింద
తొంగెరా పొలిగాడూ తొలికట్ట క్రింద
వచ్చెరా పొలిగాడూ వరగాణి దాటి
పోయెరా పొలిగాడూ పొలిమేర దాటి. ||వ||

గీ. అనుచుఁ బొలి నాఁగి బంతుల నవలఁద్రోలి
కంకులం దుళ్ళి దంతెలఁ గలయ దున్ని
పొల్లు పొలకట్టు పొలికట్టె వల్ల నుసిమి
రాశి కళ్ళములోఁ బ్రోవుచేసి రంత.

ఆ. తూరుపాఱఁబట్టి తోడ్తోడ నుక్కడా
ల్పట్టు వేళ వచ్చిపడె జనంబు
కుంటి గ్రుడ్డి పిచ్చుగుంటువాం డ్రనదలు
మూల మండి యిసుక రాలకుండ.

ఆ. వచ్చినట్టివారి వల్లగా దనకుండ
అన్నొ? యిన్నొ? పెట్టి యంపినాఁడు
ఎముక లేని చేతి కీశ్వరుం డిడ్డవో
బడుగు లెందఱైన బ్రదుకఁగలరు.

ఆ. పెట్టుబడులు, కొంగుభిక్షాలు, సిస్తులు
కూలినాలి యితనిఁ గూలఁద్రోసె
సరిగ రెక్క చూడఁ జాకిరి గిట్టదు
తుట్టతుదకు నసలు సెట్టిమిగులు.

క. దొరతనమొ? దొంగతనమో?
కఱవో? కాలంబో? రైతుకష్టార్జిత మం
దఱు దిని సుఖించుచుండఁగఁ
గఱ వని యితఁడేడ్చుటకును గారణమేమో?

ఇట్లు దుర్భరస్థితిందలపించు రైతు జీవితము నాఁడు కళ్ళమ్ము నుండి గృహాభిముఖమ్మగు గింజలబండికండ్లవదువున గిఱ్ఱున దిరుగుచు నుచ్చనీవ ములం బొరయుచు న్నొగలఁ గొల్పైన రాయుని దృగ్వలనమ్ముల గోచరించు నట్లుండె. ఇసుక లేడెం బ్రుంగుడుపడు చక్రధార లస్ఫుట రేఖాన్వితమ్మురై తన్మనోవిభ్రమము వెలార్చుచు నంతలోఁ బో కార్చుచు వెన్నంటు చాద్పున నిరుగడలం జుట్టి వచ్చుచుండె.

అప్పుడప్పుడ దిక్తటముల నలమికొన్న సంజకెంజాయలు బంగారునీరద్దినవి. ఆపైఁబైరగాడ్పు లుల్లసిల్లినవి. అందుఁ జెమ్మట ముత్యాలింకి నెమ్మేన నూతన కాంతినూల్కొన్నది. అక్కతన నొడలొక్కింత సేదదీఱినది. అపుడే గూండ్ల కరుగు పక్షుల సంగీతమ్ములకు వీనులు విచ్చినవి. చిత్తము చిగిరించినది. అటునిటుఁగంచెలంగులుక్క రంగు రంగుల గడ్డిపూలు కన్నులఁ గొఁగిలించినవి. ఆ పూవులన్మసురుకొను సీతాకోకముల లాత్మ నలరించినవి. వాని లేఁగాళ్ళం దవిలితలయూచు మొలక పచ్చిక తలఁపురెగఁబోసినది. ఇట్టి ప్రకృతిసంపదలం దోఁగి రాయఁడు తన్మయుఁడై మధ్య మధ్యఁ జెండ్రకోల సవరించి "ఛే యని గిత్తల నదల్చుచుఁ గనుచీఁకటి మేర కింటి కేతెంచుసరికి

గీ. కోడె ప్రాణము గుటగుట లాడె నంచు
విన్న తోడన మున్ముందె వెంకటాద్రి
కన్ను మూసె నిఁకం జెప్పఁగా దరంబె
రాయుని కుటుంబ మిట్లు వాపోయెనంచు.

కం. చూరుల బారులు దీరె
న్నారాయణ? వెంకటమ్మ నాఁడు మొదలుగా
నీరము ముట్టక పిలిచిన
మాఱాడక తుట్టతుదకు మంచము పట్టెన్

ఆ. పక్షు లాలకించెఁ బాప మా సిరిదేవి
ఇంట నేలఁ గఱచి యేడ్చుచుండ
గుండె చీకు పుట్టి కూడునీ ళ్ళనకుండఁ
గ్రమముగాను బద్ధగట్టియయ్యె.

గీ. తల్లిదండ్రులమా టేఁకఁ దడవనేల?
చావు బ్రదుకుల సంశయజీవులైరి
గడ్డిగింజల బత్తెము గలదు గాన
బ్రదికి బట్టను గట్టి రిప్పటికి వారు.

ఆ. వెంకటాద్రి కోర్కె వృథ చేయకుండఁగాఁ
గోడె నతనిఁ గొండబోడు దిగువ
స్థిర సమాధిచేసి తిరునాళ్ళ జరిపిరి
పట్టుపట్టి చుట్టుపట్ల ప్రజలు.









(హరికథ)

# మలిపాలు

## ప్రగతి

బావ నప్పు నోదార్చు మిషన్గోపయ్య యిచటి కేతెంచెన్
కావడి నీళులు పోయుచు నిచటనె గాలము గడపఁ దలంచెన్
రాయఁడు దిగులుంగూరి యింటిని బరామరిసించుటె మఱచెన్
వేయి గుఱ్ఱముల నెక్కిన ట్లితఁడు విచ్చల విడిగాఁ బఱచెన్
ఇంట బైటఁ బడి తెచ్చుట కిచ్చుట కితని పెత్తనమె హెచ్చెన్
పంట పైరు లయివజులుం జాలక బాకీ లెన్నియొ తెచ్చెన్
కలవారలతోఁ జీట్లపేకలకుగా ధనమున్ వెదపెట్టెన్
గలుగానక నిందల పాలై చీఁకటి తప్పుల కొడిగట్టెన్
సాగిన మట్టుకు బొమ్మలాటలున్ భాగవతము లాడించెన్
సాగకున్న గూపెట్టి నల్వురన్ సన్యాసులఁ గావించెన్.

గీ. కొంచె కోణంగియై యిట్టులుంటఁ జూచి
పెడ దిరుగునంచు లోలోనఁ బిసికికొనిరి
అన్నింటికిఁ గత్తిభాయిగాఁ డయ్యుఁ దుదకు
అదపులేక ప్రవర్తించె నన్ని యెడల

గీ. పెండ్లి వలె నని యప్పుతోం బెనంగినాండు
తీర బావనుగూడ వేధించినాండు
కష్టపడు వారికే యసల్ గతులు లేవు
ఎవ్వ రీయయ్యకుం బిల్ల నిత్తుమనిరి.

## ప్రగతి

అక్కడక్కడన్ దోట్లు వేసె నితండాండు పిల్ల గల చోట్లన్
ఎక్కడైననున్ సందు దొరకలే దితనికిం జుట్టుంబట్లన్
నేరుగ సారెకుం దనముతాను బలుసారులు సంపోందుగన్
వారు వితంతు వివాహము మంచిది వాటమైనకడ ననంగన్
ఎచ్చటికోంబోనేల అప్పబిడ్డింటనె గందని పలుకన్
మెచ్చిరి వీపుందట్టుచు దోహద మిచ్చిరి చిర్నగవొలుకన్
అదిసుత సిరిదేవిని గనినంతన హృదయము గుబగుబలాడున్
ఇదివర కున్నటువంటి చనవుతో మెదలుటకు న్మోమోడున్

ఇట్లుండియు నప్పుడప్పుడు,

సీ. ఈ వేళ వంట నీవే చేసినట్లున్న
దింత కమ్మందనమ్ము నెన్నండెఱుంగ?
ఈఁకమ్మి లేని కోకే మంత 'బాగుండు'?
కరకంచు వేయించి కట్టరాదా?
ఈ రాగి గోట్లు చేయించినా రెందులం?
కే రైనం బెట్టుచున్నారె నేండు?
తల దువ్వుకొన్నచోం దప్పేమి చెప్పుమా?
పరిశుభ్రముగ నున్నం గఱతు రేమి?

పది పదాఱేండ్లు నిండని పదుచు వేమి?
పోరుపెట్టినం గూడ ముమ్మాఱు దినవు
ఇది మొదట లక్ష్మి వోలె నా యెదుట నిలువు
మనుచు నామె ప్రసన్నత కతండు వలుకు.

సీ. తను జూచినట్టు లాతనిమది కెక్కెనా
కనుఁగొట్టి నవ్వు మొగంబు పెట్టు
ఎదురు తాకునం గొంగు గదిసిన ట్లుండెనా
నిలువెల్ల నూరకే పులకరించు
నీరు నిప్పన్న వేసారక తెచ్చెనా
చేతి కిమ్మని దండచేయి చాఁచు
పలుకరించిన తోడ బదులు మాటాడెనా
కొస దాఁక వినం జెవి కోసికొనును

కోర్కె దెల్పుట కెంతొ సంకోచపడును
బావ యెఱింగిన ముప్పని భయము చెందు
అసలు సంగతి తేలరే దని తపించు
చిట్టి బాగుల గోపయ్య పెచ్చరిల్లి.

## ప్రగతి

ఈ సమస్య దేలుట కొఱ కాతం డెన్నో యెత్తులు వేసెన్
వీసమైన లాభం బొడంగూడక వెకలివేష్టలం జేసెన్
సిరిదేవికి నుదుకెత్తిన దీతని చేష్టలు దిలకింపంగన్
త్వరపడకే మెలంకువతోం గాలము జరిపిన దిట్లుండంగన్
పైర దిరిగి పొలాలు నలువైపులం దెగంబండినవి
ఓరలు, దోసలు, వంగలు, మిరెపలు పేరెత్తినం బల్కినవి.

## మంజరి

పోటాకు దిగి నాటు పొగతోంట బడరె
వరిగ ముత్తైదువ వలె వెన్ను వ్రాల్చెం
గొతిమిరి ముత్యాలగుత్తులం గులికెం
జేమంతి సిగపూలు సింగార మొలికె
ముద్దబంతికి రేంత మొగ మెట్టవాటె
విరిమల్లె గుత్తులన్ గరగరల్ నెఱపె
ఔరుగంటులమట్టు నందాలు గురిసెం
బ్రత్తి గుల్లలు విట్లి పకపక నవ్వె
ఆతటి సిరిదేవి యమ్మతోంగలిసి
విడిప్రత్తి గుల్లలన్ విదుమచుండంగ
గున్న మామిడిక్రింద గోపయ్య నిలిచి
సిరిదేవి కురులలో జిగి వెల్లివాడిచి
చెక్కుల డిగువాలు చెమ్మటం జూచి
కోడేరువంటి ముక్కున కందమిచ్చు
బిగువుదప్పని రేంత పెదవులం గాంచి
బంగారు తీంగ కిబ్బడి సొంపుగూర్చు
తిన్నని మెడచుట్టు దృష్టి సారించి
ఆందోంక హస్తాల కదికినట్లున్న
పెసర కాయలవంటి వ్రేళులం జూచి
పరవశమ్మున నిట్లు పాడుకొన్నాండు

## మంజుగతి

కోయిల గుట్టము పైన వసంతుండు కొలువౌడేనాండో
కౌంగిింటం గ్రుచ్చుట యేనాండో ॥కో॥

రేయిపుళ్ళతో మామిడి పర్వులు దీయుట యేనాండో
పూవులు పూయుట యేనాండో ॥కో॥
పూచీ కాయులుగాచి పసందుగఁ బొదలుట యేనాండో
ముద్దుగ మెదలుట యేనాండో ॥కో॥
కొసరికొమ్మలోఁ గోకిల తిన్నఁగఁ గూయుట యేనాండో
రాగము దీయుట యేనాండో ॥కో॥
కోకిల చనంగా ముద్దుచిలుకతోఁ గులుకుట యేనాండో
ఫలముం జిలుకుట యేనాండో ॥కో॥
ప్రాంతక్రొత్త రుచులం దలపించుచుఁ బదురుట యేనాండో
జంటగఁ గుదురుట యేనాండో ॥కో॥

ఇప్పాటకు సిరిదేవి మొదలు కంపమెత్తి మనసు సరిచేసి కొన్నది. ఇట్లయ్యు గోవిందమ్మ కి గోడేమియుం దెలియక తనకందిన గుల్ల విదుచుచుండె నంతటం జల్లపడ రాయండుం గోపయ్యయు దొరగిలిన దోసపండ్లు జారెలనింపి బండ్లకెత్తుకొని ప్రత్తి మూటలయిందారును జాము ప్రొద్దు గలుగ నింటి కేతెంచి రా తెలవాయిగట్ల రాయండు చలిది గట్టించుకొని బండివెంట మాదిగంకని దోడ్కొని తూర్పుటూళ్లకేతెంచి గింజకు మార్కు మొనరించుకొను నెడనొకచో

ఆ. బండి నేల రోడ్డుపై నిల్పి నావంచు
వచ్చె నెట్టి బుట్టవాఁ డొకండు
ఐన దేఁగుచుంటి మను నంతలో వాఁడు
కదలు కదలు మంచుఁ గనుల నుఱిమె.

ఆ. పోవుచుంటి మనంగఁ బోట్లాడెదేలన్న
మాట యిదుగు మంచు లాటినెత్తె
రమ్ము చూత మంచు రాయండు నాతండు
మోడిదేలి కిచులాడినారు.

## ప్రగతి

చుట్టుపట్ల జను లా చోద్యమ్ముం జూచుచు సర్దిరి తగవున్
ఎట్టులొ బుట్టెందు దోసపండ్లు సరిపెట్టిన వాతని బిగువున్
చుక్క పొడువంగా బండిపోవునని యిక్కపటాత్మకుఁ డెటింగెన్
త్రుక్కడిమూఁకలఁ గొల్లఁగొట్టుఁడని ముందెపనిచి యుప్పొంగెన్
బండి జూడఁ గనిపట్టి దొంగలున్ బాప మనక యిర్వురను
బండి పరమునకుఁ గట్టి దోఁచుకొని పాఱి రెటకొ? స్వేచ్ఛగను
చావు దప్పి కను లొట్టపోయి మఱి చనుదెంచిరి కొంపలకు
అవు రనిరి గోవిందమ్మయు మొదలగువా రా దెబ్బలకు

ఆ. ఉదుకుఁగాపుఁ గాచి రొకనాఁడు రెన్నాళు
లీసుగూరి తిట్టిపోసికొనుచు
అయిన కడకు రైతు కపర ధాన్యమ్ము రే
చాలు నిట్టి వెల్ల శ్రమకె గాని.

ఆ. కొన్నినాళ్ళు గడచె గోపయ్య కోరిక
దీఱ కన్నిమెడలఁ దెంపుచేసి
నేఁడు త్రాడొ పేడొ నిగ్గు దీయఁదలంచి
వీలు కొఱకు నింటవేచియుండె.

నాఁడు నిండుపూర్ణిమ పిండియారపోసిన వదువున స్వెండి పూఁతంబురు డించు పండువెన్నెల యజాండ భాండంబునిండియెక్క పెట్టునఁ గాయుచుండ రాయుం డాఱుబైట మంచముపైఁ బన్నుండి వెన్నెల వెల్లిం దోఁగుచుఁ జల్లని గాడ్పుటూయెలం దూఁగుచు నానందాతి రేకంబునఁ గంధార్థములం బాడుకొనుచుండ గోవిందమ్మయుఁ గుడివలను మంచ మానుకొని యుబు సులాడుచున్నతఱి

## మంజరి

గోపయ్య లిండికిం గూరుచున్నంత
సిరిదేవి వడ్డింప నరుఁగుదెంచినది
తలవంచి వడ్డించు తరుణమ్మునందు
ఆవేశపడి తెప్ప లల్లార్చినాఁడు
కామార్తుఁ డైనాఁడు కనుమూసినాఁడు
పయ్యెదకొంగీడ్చి పట్టుకొన్నాఁడు
పెడచేయి వైచి పైఁబడఁ బోవునంత

## ప్రగతి

తత్తర పడి సిరిదేవి కెవ్వు మని మొత్తకుఁ జేరంబడఁగన్
ఉత్తలపడి ములుగఱ్ఱ పుచ్చుకొని యుటికి తండ్రి పైఁబడఁగన్
చెమటపట్టి సిరిదేవి వాని కంఠము సవరించుచుఁ బలికెన్
నమలులోన నన్నము గొంతునఁ బడె సుమి యని కన్నీరొలికెన్
తమ్ముని దుర్గతి దలఁచుక గోవిందమ్మయు లబలబలాడెన్
నిమ్మళించెనా? యని రాయుం డతనిన్ సుసాంత్వనములాడెన్
పాఱఁదన్నినఁ బంచదారలోఁ బడితినంచు నతఁడెంచెన్
క్రూరుఁడెంతకుం దలపడె నని యక్కోమలి కదు చింతించెన్

ఆ. లోకనింద కులికి యాత్రియుఁ గావించె
అయిన నిట్టి నాప కాసపడునె
అసలు బడితపూజ లవసర మ్మిటువంటి
ఒడలు దెలియునట్టి చెడుగులకును

ఆ. తల్లితోడ నితని దౌష్ట్య మింమకఁ దెల్ప
తమ్ముగుఱ్ఱ నామె తరలు మనియె
ఇంకఁ జూడవచ్చు నీ యయ్య శౌర్యమ్ము
లగ్గిరాముఁ డయ్యె నంతనుండి.

తాముస్నప్పులం బొడిచి తెచ్చిన సాహుకారు చెవి గఱచి బావపై కెగవిడిచె నాతం డిదే సమయం బని ప్రాంత చిట్టాంబైకిం దీసి అందం దడిగించియుం, దా నడిగియు, నింక లాభము లేదనియు, నెత్తివత్తు ననియు, మర్యాద గాదనియు, మాట దక్క దనియు నదలించి బెదరించిన రాయం డెంతయు వగచి ఇప్పాటు దగ దనియు నీ యదనపుం బద్దు లేనెఱుంగ ననియుం జలపట్టి వాదించిన నాతండు

సీ. పిల్ల పెండ్లికిం బద్దువెట్టితివే గాని
కుడిచిన జిహ్వకుం గుర్తు లేదె?
అట్లతద్దెకు ఓడ్డ నంపితివే గాని
చెప్పిన నోటికి సిగ్గు లేదె?
పాడి గేదెకు నప్పుపట్టితివే గానిం
పొందిన చేతికి బుద్ధి లేదె?
కూలివానికి గింజ కొలిపించితివి గాని
పంపిన దర్జాకుం బరువు లేదె?
మఱంది నింటం బెట్టి మా కొంప లార్పితి
వతండు పాదువకున్న యప్పు లేవి?
అయ్య తెచ్చిపెట్టి నందఱు దిన్నారు
ఎఱుంగమంచు నిప్పు డేడ్చినారు.

ఆ. సాహుకారు సొమ్ము సత్తుగాం దినవలెం
దమ దివాణ మింత తఱుగం రాదు
పుణ్యపూరుషుడవు బోనెక్కినప్పుడే
కక్క గం వటంచుం గదరె నంత.

ప్రగతి

సిస్తుల తరుణము వచ్చి దప్పువేసిన రాయుండానాండె
పస్తులో? నిస్తులో? చెల్లించుటకై వచ్చెనతని కెవరీడె?

కరణము, మునసపు లదన మ్మడిగిన ఘర్షణ పూర్తిగ జరుగన్
తిరిగి చూడ కటు రాయుండరిగెం గరకుటమ్ముపలె పరగన్
పోతు గడ్డ నిటు గరంగఁ దినుట కెనుబోతులు పుట్టిన వనుచున్
రైతుబిడ్డ లను బండబూతులకు రచ్చపట్లు తలవంచున్.

ఆ. పాపకర్ముఁడు కరణము పాపరాజు
పరమ నీచుఁడు మునసపు బాపినీడు
రాయునిం గుంతఁబెట్టఁ గారాడినారు
అదునుకై త్రాఁచుఁ బాముల ట్లాగినారు.

రాయుండును రైతు భూముల జాయింటు పట్టాలుండఁ గూడదనియు, రోడ్డు చెంగఁ దగ్గింపవలె ననియు, గ్రామాధికారులు లేందురివిన్యూ నొకే నెంబరునకుఁ గట్టించుకొనఁ గూడ దనియు, రైతు వారీ భూముల సద్దివిజను లేర్పాటుచేయవలె ననియు, జమాబంది పేర మున్సపు కరణము లాచరించు నక్రమచర్యలు వివరించుచు గ్రామస్థులచే సర్కారువారి కొక మహజర్నామా పెట్టించు టెటింగి మున్సపు బాపినీడుడికి పోవుచుండఁ బ్రత్యేకించి పాపరాజు,

సీ. అమ్మాయి పెండ్లికి నందటివలెఁ దాను
చదివింప లేదన్న చలము కొంత
బంధుల నంపఁగా బండి కట్టు మంటన్నఁ
గట్టలే దన్న యాగ్రహము కొంత
అనువైన మేంతఁ దా నడిగినంతన వెళ్ళి
తెచ్చిపెట్టఁ డంటన్న కచ్చె కొంత
ముందు పండిన కాయ ముసి ముట్టకుండఁగా
ఎపుడంప లేదన్న యీర్ష్యకొంత

పవలు రేయును బనిలేని చవటలట్లు
తన్ను సేవింపఁ డన్న క్రోధమ్ము కొంత
పెచ్చురిలి యక్కలమ్మునఁ బెచ్చు పెరిగి
అగ్గిలో గుగ్గిలము వేసినట్టులయ్యె.

## మంజరి

ఈ ముగ తెగలున్న వెట్లో యెఱింగి
అగ్గికి గాలి తో డైన మాదిరిగఁ
బరమ సన్యాసి గోపయ్యతో డయ్యె
ఈ యండతో బావ నేద్పింపఁ దలఁచి

## పూదండ

జాము రాతిరి వేళ రాయని
వామి దొడ్డికి నిప్పు పెట్టెను
ధూమధామములైన మంటలు
వ్యోమతల మంటెన్.
ఎల్లవా రా మంటలం గని
కల్లువడి పరువెత్తి రార్పఁగ
వల్లగాకయు గోళ్ళు గిల్లుచు
మళ్ళి రల్లల్లన్.

గొడ్డు గోదల పాప మింతకు
బిడ్డ బిడ్డ తరమ్ము గొట్టును
గొడ్డు, బిడ్డలు గల్గువా రీ
చెడ్డ చేయుదురా?
రాయఁ డెవ రే మన్నఁ దా నా
చాయకైనను బోయి యెఱుఁగండు
కాయకష్టముఁ దలప గుండెలొ
బాయి వడె నేమో!
రెండు మూన్నాళ్ళకు నికింతకు
రెండు రెట్లుగ వామి పడియెన్
గండలగు మన రైతు బిడ్డల
అండ లిట్లుండున్.

## ప్రగతి

ఇంతటం దనియక పాపరాజుచే నితండు కేసు పెట్టించెన్
అంతు దేలు నీ దెబ్బతోడ నని యచ్చ టచట ముట్టించెన్
అరుగుమీంద రాయం డొకప్డు పలు పల్లుకొనుచుం గూర్చుండెన్
సిరిదేవియుం బాల్పితికి దూడ నిటు చేర విడువుమనుచుండెన్
గోవిందమ్మయు నీళ్ళగాబుకడం గుండలుదోముచునుండెన్
ఆవేళన్ సమనుల్ జవాను రాయని ముందిడి నిల్చుండెన్
తన హయాములోం గోర్టు నెక్క కిం దనుక నీద్చుకొని వచ్చెన్
కనుక గతుక్కున గుండెం లోపల గాలము పడినటు నొచ్చెన్
గోవింద మ్మింక ఠొమ్ము బాదుకొని గొల్లున నేడువంజొచ్చెన్
తీవరపడి లాభములేదని సిరిదేవి తల్లి నిటు దెచ్చెన్
ఇంటిప్రక్కవాండైన రామిరెడ్డీ సంగతి గనిపెట్టెన్
తుంటరివాం డగు పాపరాజు నింక దుంపతెంపం దలపెట్టెన్
అప్పుడపుడ తాలూకాఫీసున కరిగి నకళ్ళం దెచ్చెన్
పప్పులుదుక వింకం బాపరాజు కని పదిమందికి సెలవిచ్చెన్.

ఆ. అంతం దెంపులేక యాఫీసుచుట్టును
గడియ గడియకు నధికారి చుట్టు
కాలు గాలు పిల్లికరణి సిగ్గుదొలంగి
తిరిగెం "దూకి తూకి" కరణమయ్య.

ఆ. మాట సాగుచోట గాటుగ నొప్పించి
చేయి చాపుచోట మాయచేసి
చిల్లిగవ్వ సొంతచేతిది పెట్టక
నడపినాండు కొంత నాటకంబు.

ఆ. వేయి చెప్పఁ డింక రాయండు దీనితో
గుడిసెఁ బీకవలయుఁ గొంందిలోనె
చూడు నా తడాఖ చూపింతునని పండ్లు
కొఱికి యక్క డకడఁ గోంతఁ గోయు.

ఇందులకుందోదు,

## ప్రగతి

సాహుకారు నెగవిడిచిరి నీపనిఁ జక్కంబెట్టుకొనుమంచున్
ఈ హోమీతోఁ బంచాయతి కోర్టెక్కెనతండు హుమ్మంచున్
రైతును గోర్టున కెక్కింపకు మని రామిరెడ్డి చెప్పించెన్
నాతలగాదింకఁ గంచరితల యని యాతండు బిఱ్ఱబిగించెన్
మునుసపు షడ్డకుండే ప్రసిడెంటింకఁ దనకుం భయమ్మెటుగలుగున్
అనుకొన్నంతకు డిక్రి పొంది దురాత్ముండు ముదమునఁజెంగున్
ఆ మఱునాండే రాయండు సావర మమ్మొటకై యత్నించెన్
రామిరెడ్డి సంహోతోఁ బరగడ భూమి నమ్మి చెల్లించెన్
సిరిదేవియు దన తాటదగులు తెగబరికి కేసునకుం బెట్టెన్
తిరుగుడు ఖర్చుకుఁ జాల కష్టలకు గురి కావలసియు వచ్చెన్.

ఆ. తిన్న తిండి గాక యున్న యిల్లుంగాక
రాయఁ డెంతొ చితికిపోయినాండు
కండ లూడ్చి తినెడి బండచాకిరి గాక
ఇట్టి సంకటముల కెట్టు లోర్చు.

ఇంతలోఁ బాపరాజు కేసు విచారణకు వచ్చి యతని కొక సంవత్సరముఁపా టుద్యోగ మూడుటయు, మునసపునకు ముద్రవడుటయు, రాయని విడిచి పుచ్చుటయు జరిగిన దిట్లగుటకుం గారణమే మన:-

పాపరాజు కేసు పెట్టునపుడు మున్స పూర లేదు. అయినఁ దన్ను దాంటిపోఁ

డన్న దీమసమునం బదునేడవ తేదీ బాపినీండు సెలవు పెట్టి దస్తు తన కప్పగించినట్లును దాను సివారు గ్రామమున నాండే సిస్తు వసూలు చేసికొని కనుచీంకటిమేరకు వెట్టివానిచే ముల్లె పట్టించుకొని వచ్చుచున్నట్లును డొంక దరి మిరెప కళ్ళము గాచు రాయండియ్యదు నెటింగి తన జీతగాండంకని నెగవిడిచి తా మద్దత్తయి ముల్లె దోంచికొనినట్లు గాలి ప్రోవుచేసి కూటసాక్ష్యముతోం గేసు బనాయించి ఆనాండే చీంకటి మొగమునం దాలూకాకచేరికిం జేరింనాండు.

ఇది తెలియక గ్రామాంతరము నుండి వచ్చిన మున్సపు నాంటియుపరా హ్ణమున రామిరెడ్డి కడ కిస్తూ చెల్లించుకొని రసీ దిచ్చినాండు. ఇట్లగునని పాపరా జెఱుంగం డైనను నిర్భ్య రొకండై లాలూచిగాం బదునెన్మిదవ తేది తాలూకాకుం జని పదునేడవ తేది సెలవు దరఖాస్తు మంజూరు చేయించుకొని దీనిని బలపఱచుకొను నెత్తు లెత్తుచుండ నిది గమనించి రామిరెడ్డి తన రసీదును కోర్టునం దాకలుచేసి యియ్యభియోగ మ్మసత్యకల్పితమ్మని నిరూపింప నప్రాపమిటు పండినది. అదిసుత

ఆ. మొగము చూడ వెఱచు మునసపు దొరగారు
రాయండంత కన్న వేయి రెట్లు
కరణ మెట్టులైనంగాం జేయు రాయని
బావమఱంది కాళ్లువట్టినాండు.

మంజరి

అప్పు సప్పుల భార మధికమ్మై పోయి
నీలాపనిందల పాలై తపించి
పసిగ నన్నము నీరు ముసిముట్టకుండం
దల చెడ్డ ఓడ్డను దలపోసి పోసి
వెంకట మ్మింతలో వెళ్ళిపోవుటయు
కఱవు రోజులు వచ్చి వఱవట్టు లగుట
చేయు సంతన రేక సేద్యమ్ము చెడుట

విత్తిన విత్తురే వెళ్ళిరాకుంట
పూట కొక్కెత్తైనఁ బొయిరాజకుంట
అన్యులం జే చాప నలవాటు లేక
నానాఁడు క్షీణించినాఁడు రాయుండు
ఒకనాంటి రేయింట నుక్కగా నున్నఁ
బంచపాళీలోనఁ బవడించినాఁడు
కరణమ్ము చెప్పిన కరణి గోపయ్య
పొగరు చీఁకటిలోన మగులు గూడెక్కి
మసెలపై జోగాడి కొసిగుంటకడ్డ
శిరసుకు సూటిగా దొరలించినాఁడు
చప్పునఁ బైనుండి కుప్పించినాఁడు
దొడ్డి క్రోవం బట్టి దూసికొన్నాఁడు

## ప్రగతి

గోవింద మ్మిది కన్నులారఁ గనుగొని పతిపైఁ బడి యేడ్చెన్
ఆవురు మని సిరిదేవి తండ్రి శిరమద్దుచుఁ గన్నీరోడ్చెన్
నెత్తురు వఱదలువాఱి రాయఁ డతి నిస్ప్రుహుండై పడిపోయెన్
తత్తరపడి పారుగుం జనముం బరువెత్తి విస్తుపడి పోయెన్
గోవిందమ్మయుఁ గొంపఁగూల్చె మాగోప య్యని వాపోయెన్
పోవే? కర్మము చాల దంచు సిరిదేవి తల్లి కడ్డాయెన్
బావురుబిల్లీ గుంటకడ్డనిటు పడఁద్రోసిన దన "నాయెన్
కావలె" నని ప్రజలనుకొని రంతటఁగాంగల పనులయిపోయెన్.

## మంజరి

పాప మాతఁడు తెల్లవార్చుకొన్నాఁడు
గోపయ్య పొనరించు ఘోర కార్యములు

సిరిదేవి సైరించి సరిపుచ్చు టెల్ల
అంతులం బోయిన నర్థమ్ముగాదు
ఈతఁ డన్నన్ బ్రేమ మిసుమంత లేదు
అండదం డగునని యాశింపలేదు
కారణమిం కేమి గలదో యెఱుంగఁ
బరువుగల్గిన వారి పనులిట్టు లుండు
నేర్పుగల్గినవారి నెన రిట్టు లుండుఁ
బదుగురు చెడ్డగా భావింపకుంద్రు
నలువురు వింతగాఁ దలపోయకుంద్రు
అభిమాన మున్నవా రన్యుల కైనఁ
బరువు నష్ట మిష్టపడ రెన్నఁడైన
అందును రైతు బిడ్డైనను జాలు
పరులు సుఖింపగా మురిపెమ్ము చెందుఁ
దనసొమ్ము దిన్న నాతనిది గానమ్ము
ఇటువంటి జాతికే యిక్కటుల్ గలుగు
ఈసిరిదేవి తన్నెవ్వ రేమన్నఁ
బల్లెత్తిగట్టిగాఁ బలుక మోమోదు.

ఇట్టి దయ్యుం దండ్రి కడచన్నదాది ఇలు దిద్దుకొన నేర్పు గలిగి లోకము పట్లఁ గనుగలిగి వర్తించుచుం బొలము బీడుపడు టెఱింగి నిచ్చ లొంటిఁజని వేరువెల్లంకి దీయుచుం బాలికాఁపు రామిరెడ్డి హెచ్చరికతోఁ బొలము పండు వలెఁ జేసినది. ఇంత కనావృష్టి దోషమ్ముకతన నెల్లెడల నెబ్బెట్లు గలిగి ఇంత యున్నవారికే డబ్బు కిసాటగుటంజేసి సిరిదేవి కెటు పాల్పోక తల్లి నంపి యొకానొక మోతుబరి నప్పడిగింప నతండు,

ఆ. గుట్టు మట్టు చూచి కొంప గోడియుఁ జూచి
అప్పు పెట్టవలయు నమ్మ! యెపుడు
వచ్చి చూచి యప్పు వంసినచో నిత్తు
ననుచు విందు గుడువ నతఁడు రాఁగ,

ఆ. పప్పు బువ్వ పెట్టి పట్టెమంచము వైచి
ముప్పు 'తిప్ప' లెల్లఁ జెప్పికొనిరి
తమరు 'యావదాస్తి' తాకట్టు పెట్టిన
ఇత్తు నప్పు సంశయింప ననిన,

ఆ. తల్లి బిడ్డ లతని తత్వమ్ము గుర్తించి
సుంత మొగ మొగాలు చూచుకొనిరి
ఇట్లు పప్పు బువ్వ రేప్రొద్దు గుడిచెడు
వారి కప్పు పెట్ట వల్లపడదు.

గీ. ఏను చెప్పిన దిర్వుర కిష్టమైనఁ
జూచికొనవచ్చు లెమ్మని లేచె నతఁడు
అందువా రైన మాఱుమా టాడలేదు
పరువుపోయిన దని చింతపడి రొకింత

ఆ. తల్ల క్రిందులైనఁ దాకట్టు పెట్టఁడు
త్రావఁ డింత తప్పుఁద్రోవఁ జనఁడు
పరుల కున్న వఱకుఁ బారవేసి శ్రమించు
రైతుబిడ్డ కిదియు ప్రతిఫలమ్ము.

సీ. మినువట్టి నలుదెసల్ మెఱసిపోయినఁ గాని
కనుఱెప్పఁ గొట్టఁ డాకర్మయోగి
మందు వేసంగి నిప్పై చెందుచుండినఁ గాని
కాయమ్ముఁ డాపఁ డాకష్టజీవి
అఱుగాలము లేమిడై కృశించినఁ గాని
పడిపంచఁ ద్రొక్కఁ డా భాగ్యశాలి
చుట్టుపక్కా లిల్లు చూఱకొన్నం గాని
దన్నుందా నెఱుఁగఁ డా ధర్మరాజు

విశ్వ మాద మఱచి విషమిచ్చు చున్నను
దోసి లొగ్గి కనులు మూసినాఁడు
వెనుక ముందు లేని మనవంటి వారల
నెంతమంది నుద్ధరింపఁగలఁడొ?

ఆ. కడుపు నాయఁ గట్టి కల దెల్ల మన కిచ్చి
కష్ట మతని సొమ్ముగా గణించి
గుండె చీకువట్టి కూరనారైపోయి
బ్రదుకుచున్న రైతు బదవలెంచి,

## ప్రగతి

సిరిదేవికి నిద్దురపట్టక యోచించును రేవగల్లన్
తరణోపాయము లేదు రైతుకని తల్లడపడు నల్లన్
సరకులకుం ధర తగ్గి రైతు లగచాట్లు పడుట వీక్షించెన్
ధర పల్కినను గమీషను మొదలగు దురవస్థల గమనించెన్
కరణము మునసపు లొనరించెడు నక్రమచర్యలు మదికెక్కెన్
పరపతియైనను సరిగఁ బుట్టక బాధలొందుటకుఁ బొక్కెన్
పండిన నెండిన ముల్లెలు, ముడుపులు పాయవంటంచుఁ దలంచెన్
అండలేని కర్షకులకు దేవుం డుండియు లేఁడనిపించెన్.

ఈ తలపోంతల కగ్గమై యెన్నాళ్లు గడంగాన కాయేందు సక్రమముగాంగాల మ్మగుట కెంతయు సంతసించి రామిరెడ్డి సలహాఁ చొప్పునం గమతముంచి తండ్రి హయామున నప్పులకుం బోంగా మిగిలిన రెండు గొఱ్ఱుల సావరమున జాయంటు వ్యవసాయ మారంభించినది. అందుచే

ఆ. పనులు కొంఱంత పడవు పదునులో నదునులోం
గలిసివచ్చు నెల్ల కార్యములును
కూలినాలిపట్లం గొదవన్న దుండదు
ఇట్టి సేద్యమైన నెంతహాయి!

ఆ. చాల కాల మిట్లు జాయంటుగా నుండ
మాలు మఱు గూడె బోలె డంత
చిట్టచివరకెంతొ చేమెంంకువ గల్గి
పూర్వ మట్టు లిల్లు పొంగిపోయె.

అంతట,

ప్రగతి

గోవిందమ్మకుం బెంపు తీసికొనం గోర్కిగలదు వారసునిన్
ఆవిషయము సిరిదేవి తల్లి కెదురాడి త్రిప్పె నెట్లేనిన్
రైతుసంస్థ లెటు చాలినన్ని మనరాష్ట్రమ్మున లేవనుచున్
చేతనైన వఱకైనను సాయము చేయుంగం దల్లికి వినుచున్
కూంతులోడిదే లోక మ్మని యామాతృదేవి తలంద్రిప్పెన్
రైతు సంఘ మివి నెఱవేర్చిన సర్వస్వమిత్తునని చెప్పెన్:-

మంజరి

ఊరూర రైతుల కుత్సాహమెసంగం
బనిపాటులంకుం బోటి పచరింప వలయు

ఎడ్లపందెములు వేయించి మేలెంచి
ఏడేట బహుమతులిప్పింప వలయు
రైతుసంఘప్రచారకుల నంపించి
సంఘ ప్రబోధమ్ము జరిపింపవలయు
రైతువాఙ్మయ కావ్యరత్నమ్ము లేర్చి
కర్షకకవులను గౌరవింపవలెఁ
బ్రతినిత్యమును రైతు స్థితిగతుల్ దెల్పు
పత్రిక లందందుఁ బ్రచురింప వలయుఁ
బ్రతి గ్రామమున రైతు భజనకూటములు
నియమమ్ము దప్పక నెలకొల్పవలయు

గీ. అనుచు నాస్తి సమస్తమ్ము నప్పడపుడె
ప్రేమ చొప్పడ గుంటూరిసీమ రైతు
సంఘము పరమ్ము చేసి రీశ్వరుఁడు గలుగఁ
బుట్టుగతు లుండవా? రెండు పొట్టంకును.

గీ. ఈ మహోత్యాగమున యందు నిమిడెనేమొ?
రైతు సామ్రాజ్యమున కంకురార్పణమ్ము
ఎవ్వరేమన్న సిరిదేవి కిడుగారు
తరుణులకు నెల్ల నీమె యాదర్శకంబు.

## ప్రగతి

ఈ విషయ మ్మొరంత పొక్కియరరే? యనిపించిన దెందున్
దేవతరా? సిరిదేవి యంటంచు నుతింపని వారరు దందున్
కరణము మునసపు లిర్వురు మాత్రము కొఁటకొఁటలాడిరి గాని
పరువు రేని వారనుకొన్నం బరిపాటికి రాదది పోని.

పూర్వము రాయని పైనభియోగముం దెచ్చి పంచాయతి కెక్కించియైనకడ కొడుపుకొన్న సాహుకా రిది విని విచ్చలకు విఱిగి తనకు సంతురేమి న్వగచి తనయనంతర మీయాస్తి యబ్బర్ల పాలగుననియు, సిరిదేవి యింత యొప్పనే యనియు, అక్రమ సంపాదన మన్య సత్కారమునఁ బఱచి పోననియు భావించి వెంకటాద్రిని గోడెను సమాధి చేసిన కొండబోడుదిగువ రైతుభజనమందిర మ్మొండు నిర్మించి రైతుయాత్రికులకు సదుపాయములు గల్పించి దిబ్బెము నకుఁ గా నఖండకైంకర్య మొనర్చి జన్మ సార్థక మొనరించు కొనియె, అదియె రానురాను 'గోమఠ' మనుపేరం బ్రసిద్ధికెక్కినది.

గీ. రాయనిం దెగటార్చి యూరాత్రి కడన
భూములం దెగించి చన్న దుర్బుద్ధివాఁడు
అనద గోపయ్య యిప్పటి కంతు లేఁడు
కవలికలుగల వృద్ధుఁ డొక్కరుండు మటుకు.

## మంజరి

గోమఠంబున యందుఁ గొన్నాళ్లనుండి
శివలింగఁ డనుపేర నివసించుచుండె
సిరిదేవి యిటకు వేంచేసి నిత్యమ్ము
రైతుకు వలయు ధర్మమ్ముల న్నొడివి
భర్తృసమాధికిం బ్రణతు లర్పించి
మంగళమున్ బాడి మరలు చున్నపుడు
పాల్గారు కనులిట్లు పలికి నట్లుండు:--

ఉ. ఇంతకు నా పరాత్పరునకే దయ గల్గిన రైతు రాజ్య మ
త్యంత విభూతిఁ బెంపెసఁగదా? మనకర్షకసార్వభౌముండే
అంతము లేని యీభువన మంతకు శాసనకర్తయై నిర
భ్యంతర పాల మ్మొనరుపం గల భాగ్యము కల్గు టెన్నఁడో!

మంగళమ్

# నినాదాలు

శ్రీమద్రైతు భజనానంద గోవిందోహరి
శ్రీమద్రైతు రమారమణ గోవిందోహరి
శ్రీమద్రైతురాజ్య వరద గోవిందోహరి

వలయువారు:

మాకినేని ప్రసాదబాబు
సంయుక్తకార్యదర్శి
3-29-56/1
కృష్ణనగర్, గుంటూరు-6
ఫోన్ : 232990

